# కవిత



అబ్బూరి వరదరాజేశ్వరరావుగారి
71వ జయంతి సందర్భంగా పునర్ముద్రితం

విశాలా గ్రంథశాల
హైదరాబాదు

KAVITA I & II

'కవిత' ప్రథమ ప్రచురణ : 1954 (జయ)
పునర్ముద్రణ : 10 అక్టోబర్, 1993

ప్రతులు : 1000

వెల : రూ.25.00

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435,
బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ -1

విశాలాంధ్ర బుక్‌హౌస్
విజయవాడ, హైదరాబాదు, తిరుపతి, హన్మకొండ
గుంటూరు, విశాఖపట్టణము, అనంతపురం, కాకినాడ.

ముద్రణ :
ఎస్.వి. ప్రింటర్స్
1-1-770/5,
గాంధినగర్,
హైదరాబాదు. - 500 380

'కవిత' ప్రచురణకు
మూలకారకుడైన
అబ్బూరి వరద రాజేశ్వరరావు
స్మృతికీ,

'కవిత' పునర్ముద్రణకు
మూలకారకుడూ,
బొంబాయిలో మార్చి 1993లో జరిగిన
బాంబు దుర్ఘటనలో
దుర్మరణం పొందిన మిత్రుడూ
డా.వై. సుధాకరరావు
(Forestry Adviser, FAO Regional Centre, Bangkok)
స్మృతికీ
సమర్పితం

డా. పస్నూరి రామారావు గారికీ,

శ్రీ గిడుతూరి సూర్యం గారికీ,

శ్రీ సమ్మెట నాగమల్లేశ్వరరావు గారికీ,

శ్రీ వి.డి. ప్రసాదరావు గారికీ

కృతజ్ఞతలు.

# కవిత

౧

సంవత్సరానికి

మూడు

సంపుటాలు

సంకలనం:

## అబ్బూరి ఛాయాదేవి

ప్రతి రూపాయన్నర

## సందేశం

ఉత్తమ కవి ఎవరైనా మహా కావ్యాలను ఒక దానికన్న ఒకటి అన్నివిధాలా మిన్నగా, ప్రతి కావ్య ఖండికనూ స్ఫురింప జేసేదిగా విరచిస్తుండాలని విశ్వసించేవారు–ఉత్తమ కవితా సాధనతో పరిచయంలేకుండా కేవలం అట్లా భావిస్తున్నారు, ముఖ్యంగా మనకాలంలో. కవి పురోగతి ద్వివిధం. సర్వాన్ని ఆహరించుకొనే కలశంలా పరిపూర్ణమవుతూ, ప్రతి అయిదు సంవత్సరాలకో, దశాబ్దానికో ఒక పరివర్తన పొంది వ్యక్తం కావడానికి ఒక వినూత్నమైన సాధనను, పరిణతాకృతిని ధరిస్తుంది.

కవే గనక ఎప్పుడూ ఉత్తమోత్తమమూ, ఉదాత్తమూ అయిన దానినే సృష్టించాలని, అనూహ్యమైన వాటి ఆవిర్భావాన్ని నిరీక్షిస్తున్నట్టయితే యాదృచ్ఛికంగా ఉత్పన్నమయే వాటిని స్వీకరించలేడు. అనుభవం ఎట్లా వర్ధమానమవుతుందో వ్యక్తం కాదు; అది ఆంతరికమైనది, అయిదు సంవత్సరాలకో పది సంవత్సరాలకో ఎప్పుడో ఒకసారి తప్ప అనుభవాల పరిణతాకృతి అవగతం కాదు.

ఈ కాలంలో కవి తన సాధనను నిరంతరం సాగిస్తుండాలి. రచనా సంవిధానంలో ఎన్నెన్నో వినూత్న ప్రయోగాలను చేస్తున్నట్టయితే ఆ అసదృశ కావ్యం ఆవిష్కృతం కావడానికి తన కృషి వేదిక అవుతుంది. విత్తటానికి సుక్షేత్రాన్ని పదును చేసినట్టవుతుంది.

కవిత్వం రాయాలని ఆకాంక్షించే కవి, ఈ సాధన అవిరళంగా చెయ్యాలి. సాధన నిర్వక్రంగా జరుగుతుండాలి. ఉద్విగ్నతలో శరణు పొందడం కన్న రచనా నైపుణ్యాన్ని ద్విగుణీకృతం చెయ్యాను విధిగా ప్రతివారం కొంతకాలం వినియోగించి, దీక్షతో రచన చేస్తుండడం అవసరం.

— టి. యస్. ఇలియట్.

న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం
నసా విద్యా నసా కళా
యద్భవేన్నచ కావ్యాంగ
మహోభారో మహాన్కవేః

*

భాద్రపదం
జయ

*

Published by A. Chaya Devi, M. A.,
at A-10-431, Himayatnagar, Hyderabad.
Printed at Moses & Co., Secunderabad.

# స్వవిషయ సూచిక

రామణీయకాన్ని
సృష్టిస్తాడు కళాస్రష్ట
కళను ఆవిష్కృతం చెయ్యటం
కళాస్రష్టను అజ్ఞాతంగా ఉంచటం
కళ లక్ష్యం.

మరొక మార్గంలో కాని
వేరొక సాధనంతో కాని
రామణీయకాన్ని గురించి
తన భావం వ్యక్తం చెయ్యగలిగినవాడు
విమర్శకుడు.

అత్యున్నతమయినా
అతి హీన మయినా
విమర్శా విధానం
స్వీయగాథా సదృశం.

రామణీయకంలో
వికృతార్థాలను చూసేవారు
భ్రష్టులు;
మనోరంజనం చెయ్యలేరు
ఇది దోషం.

రామణీయకంలో
రమణీయార్థాలను చూసేవారు
సంస్కారులు.
వీరికి భవిష్యత్తు ఉంది.

వీరే నియుక్తులు;
రమణీయార్థ మంటే
రామణీయక మనే
అర్థం చేసుకుంటారు.

నీతికరం, అవినీతికరం
అంటూ గ్రంథాలు లేవు;
బాగా వ్రాసిన పుస్తకాలు;
బాగా వ్రాయని పుస్తకాలు
అంతే.

మానవుడి నైతిక జీవనం
కళా స్రష్టకు వస్తువవుతుంది.
లోపభూయిష్టమయిన సాధనాన్ని
లోపరహితంగా ఉపయోగించటం
కళనీతి.

ఏ కళా స్రష్టకూడా
దేనినీ ఋజువు చేసేందుకు
ఇచ్ఛగించడు,
వాస్తవాలను కూడా
ఋజువు చెయ్యవచ్చును.

కళా స్రష్టకు
ధార్మిక సానుభూతిలేదు
కళా స్రష్టలో ధార్మిక సానుభూతి
క్షమించరాని శైలి తత్త్వం.

కళా స్రష్టకు
స్వాస్థ్యం తప్పదు
దేని నయినా సరే
కళాస్రష్ట వ్యక్తం చెయ్యగలడు.

సుగుణ దుర్గుణాలు
కళాసృష్టికి వస్తువులుగా
కళా స్రష్ట పరిగ్రహిస్తాడు.

స్వరూప విషయంలో
అన్ని కళల పద్ధతీ
గాయక కళ వంటిది.
సంవేదన విషయంలో
నట చాతుర్యం వంటిది.

యావత్కళా
సువ్యక్తం, సంకేతం
సువ్యక్తాన్ని శోధించేవారు
స్వవినాశనానికి.
సంకేతాన్ని చదివేవారు
స్వవినాశనానికి.

కళ ప్రతిబింబం చెయ్యటం
జీవితాన్నికాదు; ప్రేక్షకుణి

ఏ కళాకృతి విషయంలోనైనా
అభిప్రాయ భేదం ఉత్పన్నమైతే
ఆ కళాకృతి, నవ్యం, క్లిష్టం, సజీవం
అన్నమాట.

విమర్శకుల్లో అభిప్రాయభేదం
రేకెత్తిన నాడు
కళా స్రష్టకు ఆత్మసంయోగం ప్రాప్తం.

ప్రయోజనకరమయిన
వస్తువుల్ని నిర్మించి
వాటిని ప్రశంసించనంతవరకు
ఆ వస్తు నిర్మాత క్షమార్హుడు.

నిష్ప్రయోజనకరమైన
వస్తువులను నిర్మించటంలో
హేతు వొకటే—
వాటిని అమితంగా ప్రశంసించటం.

యావత్కళా
నిష్ప్రయోజనకరం

— ఆస్కార్ వైల్డ్

# అబ్బూరి రామకృష్ణరావు

## ౧

ఏనాడో ఒక్కనాడు
నేనూ నా చిన్ననాట
నవ నవ యౌవన వేళా
నందన సౌందర్యంలో

కావేరీ నదీతీర
కల్యాణ ధరిత్రి మీద
పచ్చని పచ్చిక పరుపుల
పవళించిన నాటి మాట

మసక మసక వెన్నెలతో
మత్తిల్లిన పూగమ్మలు
పూగమ్మల పెనుగొను తాం
బూల లతా పల్లవములు

తమాల తరుచ్ఛాయలలో
తలిరుటాకు గుసగుసలు
నానాసుమ పరిమళములు
వీణానిక్వణనమ్ములు

నా జీవన గగనసీమ
నాలుగు దెసలందునిండి
నా మానుష దేహంలో
నాక లోక సౌభాగ్యం
కదలినట్లు మెదలినట్లు
కడలివోలె మ్రోగినట్లు
కలలుగాంచి కళవళించి
కలలో నీ కమనీయత
గాంచి తనువు పులకరించి
నీభక్తుల కనువైనది
నిండువేష మొకటిదాల్చి

తెలుగుదారి వెలిగించే
వెలుగుదారి తెలిగించే
క్రొత్త ప్రాత మాటలతో
మెత్తని పదముల బాడుచు
ఆంధ్ర మహామహీజనని
యశోగీత మాలపించి
స్పందించిన హృదయమ్ముల
కొందర మానందించాం.

ముడుతలుపడి చినిగిపోయి
చెడిపోయిన కడిదోయిన
వెనుకటి ఆవేషాన్నే
వేవిధాల విరుపులతో
మళ్లీమళ్లీ తాలిచి
పెళ్లికొడుకులకు మల్లే
వీధివీధి విహరింతురు
ఆధునికులలో కొందరు

ఈవేషం వెనుకటిదే
ఏమీలే దావేశం
ప్రయోగాలు లేనినుడులు
అయోమయపు పలుకుబడులు
శాఖలుపై శాఖలుగా
సాగు తెలుగు సంసారం
ప్రతిఫలించ దీ నదిలో
పరిమళించ దీ వనిలో

ఎత్తండోయ్ రక్తకేతు
వొత్తండోయ్ జయశంఖం
రక్తారుణ రణపతాక
ధిక్కార మహాశంఖం !

రష్యాగురు ధూపంతో
రమ యపు శివమెత్తిన
రణాచారి గణాచారి
రణగుణాల ధ్వనులురేగ
రష్యా ఋష్యాశ్రమమున
రాగిల్లిన కావ్యధార
తెలుగుసీమ పొలిమేరల
సెలయేళ్లయి నాళికలయి
చిరకాలం ప్రవహించే
జీవనదీ మహిమలేక
అంతోయింతో శైత్యం
అంతకుమించిన పైత్యం
అందించినమాట నిజం
ఔనునిజం ! ఔనునిజం !

కీళ్లుపట్టి కళ్లుకప్పి
కళ్లెముతో బిగియించిన
గుఱ్ఱముపై స్వారిచేయు
కోవిదకవు లోక వంకా

లోలాక్షులు సహచరులై
కేళాకూళుల తిరుగుచు
లోకపు బాటల కవ్వల
చీకటులూ, వెలుతురులూ
సగంసగం కలిసిమలసి
సంధ్యారాగాలు రాలు
కుహనాలోకం లోపలి
గుహలలోన కూజించే
కోమల కవు లోక వంకా

కొలిచిన కవితాపురంధ్రి
మరపుతెరల మాటుమణగి
మాయమైనదా లేదా?

వలదని యాదల దన్నిన
వెలితి మాట లెల్లనేటి
వేదాంతము కాలేదా
ఖేదము తొలగింపలేద?

మూటగట్టి ముల్లెచుట్టి
మూలమూల లందుచాటి
బాకాలూది కేకలేసి
 లోకానికి సైగచేసి

శతసహస్ర యోజన సం
చార కుతూహల చంచల
భావనా కురంగమెక్కి
ప్రస్థానం ప్రస్థానం
భయద మహా ప్రస్థానం !

పయనమైన పదినాళ్ళకె
పదినాళ్ళకె దారితప్పి
పోయావా నానేస్తం !
ఆఁ ! యేదీ నీహస్తం.

పొరపాటీ తిరుగుబాటు
తిరుగుబాట తిరిగి చాటు !

౨

మనసులోని యాలాపము
మాటలలో మారిపోవు
ఎత్తిన కవితా దీపము
వత్తి కుమిలి యారిపోవు

ఎలుగులేని వెలుగులేని
హేమంతమ్మోయి పుత్ర
ఈ చీకటి రాజధాని
కేలా యీ దండయాత్ర.

వరదవారు కావేరీ
సరిత్తీర వృక్షరాజ
శేఖరముల నీడలలో

మంజుల మంజీరమ్ములు
మధుర రుతము సేయుచుండ
కనిపించిన మధుమూర్తి
కవితా కల్పనా లతా !
మరలనేడు నాహృదిలో
మరులుకొల్ప దలిచావా ?

నీకూ నాకూ మధ్యను
శోకార్ణవ మొకటి పొంగి
లోకా లోకమ్ములలో
లోపలి మందిర మందలి
ఒక గవాక్షమొక కవాట
మోహూ ! ఆవిష్కృతమై
వెనుకటి యాలాపమ్ములు
తునుకలు తునుకలుగా తెగి
ఒక్కచోట చిక్కువడ్డ
చక్కని నా జీవనౌక
అనంతాబ్ధి సాంగత్య
మ్మభిలషించి పయనమయ్యె

జీవనబాధకు వెలిగా
నీవూ నేనూ నీవూ
స్మృతికందని మృతి నొందని
అతిలోక విహారమ్ముల
బ్రతికేరోజులు కావివి.

మనిషిమాట మరచిపోయి
మనుగడలకు దూరముగా

మట్టినేలపైని మమత,
మానవులన, వైముఖ్యం.

జననీ జన్మ భూమిశ్చ
స్వర్గాదపి గరీయసీ
జన్మభూమి జనని కాదు
సామాన్య సుమా ఆయమ
వసుమతియగు నామెకొరకు
వల్లభులెందరు పెనగిరి ?

మొగలాయీలూ. గ్రీకులు,
బుడతకీచు, లాంగ్లేయులు,
పెర్షియనులు, ఆఫ్ఘనులూ,
ఫ్రెంచివారు, మంగోలులు,
ఎందరెంద రీనేలను
ఇలాపతులు భూపతులై
ఏలలేదు సాటిలేని
ఏకచ్ఛత్రమ్ము క్రింద
నాదేశం నారాష్ట్రం
నాపట్నం నాజిల్లా
మట్టిగడ్డ కాదుకాదు
మానవజాతి పురోగతి

మానవలోకం చుట్టూ
మసలుతున్న మహిమార్ణవ
మథనానికి దారితీసి
మండుతున్న అరణ్యాన
పండువెన్నె లలమచేసి

మెండుగ కేదారమ్ములు
పండించీ ఆకలిపులి
ఖండించీ నడచిపోవు
మానవుడా ! నీకు జయం
మాకిటుపై లేదు భయం.

మనిషి మాట మరచిపోయి
మరచిపోయి మనిషి మాట
కార్మికులూ కర్షకులూ
ధార్మికులూ ధనపతులూ
విడివిడిగా యెడపెడగా
తడబడగా ముడిపడగా
ఆవరించి తీవరించి
అవరోధం కల్పించే
ఈ చింతా దారిద్ర్యం
ఔన్నడు మము వీడిపోవు ?

౩

రాలునేమొ రాలునేమొ
రాగరసము నేడేనని
పండునేమొ నా కోర్కులు
పరవశముగ పాడేనని

వేచివేచి వేసారిన
విఫల మనోరథులకేక
వినిపించని వేళలేదు—
విధియు విరామమ్ము లేక

జగ మెరుగని సన్యాసులు
గగన కుసుమ మధువు త్రావి
కలలలోన కధలలోన
కల్పించే యెండ మావి
దప్పిగొన్న సంసారుల
తనువులు నిలబెట్టేనా ?
శోషిల్లిన శ్రమజీవుల
శోకము పోగొట్టేనా ?

నీడలేని వెలుగునకై
ఈ దేరని కాంక్షలూర
పరితపించి భ్రమియించే
భ్రాంతులార, బంధులార !
వినలేదా వినలేదా ?
విజ్ఞుల శంఖారావము,
'మాయలేని మహిమలేని
మానవుడే మనదైవము.'

వ్రాయలేక వ్రాయలేక
వ్రాయుటలో పరమార్థము
వర్ణింపగ నలవిగాక
వర్ణింపగ బలములేక
వందేమాతరమని యొక
మందారము నీ పూజా
మందిరమున నిలిపెదరొక
కొందరు మధుర కవీంద్రులు.

నరలోకపు చెరసాలకు
నలువైపుల కటకటాలు

అవనీతల మావరించి
అవరోధాలు విరోధాల్
అంతరాయ పరంపరలు
సంతమసం సంఘర్షం
సంశయాల సందోహం
సంకీర్ణ స్వాంత చింత

జననం మరణం మధ్యా
సాగే యీ ప్రస్థానం
దూర మెంత ? భార మెంత ?
ఊహల కందని తారా
వ్యూహా లవలోకించీ
అణువణువున మణగియున్న
మణిరోచిర్నివహమ్ముల
విలయ భయంకర నృత్యం
విలోకించి విలోకించి
వెలయించే ఆశ్చర్యం
విలువయెంత ? నిలువయెంత ?
తారకు తారకు దూరం
నిరాధార సంచారం

వలపులేని నవయువతీ
చలితాధరమునకూ నీ
నులివెచ్చని యూపిరికీ
గల దూర మనంతంబై
దుస్తరమై దుస్సహమై
తోచే వేళలలో నీ
దూరాలోచన లన్నీ
దూరీ కృతములు కావా ?

౪

సన్నాహముతో శ్రమతో
సంతోషముతో భ్రమతో
శ్రావ్యప్రస్థాన భేరి
సందడింప బయలుదేరి
ఎన్ని దినా లెన్నియుగా
లెన్నివీధు లెన్నిత్రోవ
లిన్నాళ్లూ నడిచితివో?
ఎన్ని నిన్న లెన్ని మొన్న
లిన్నాళ్లూ గడిచితివో?

అనాదిపురి అనంతగిరి
ఈ నగరా ల్రెంటిమధ్య
మేరలేని దూరంలో
మిధ్యా గమనంచేస్తూ
ఇటువైపూ అటువైపూ
తటముల కన్వేషిస్తూ
అందరాని అందాలకు
అందులేని చందాలకు
ఆందోళిస్తూ ఆలోచిస్తూ
ఆశిస్తూ ఆలిస్తూ
నిలిచీ నిలువని క్షణముల
నిలుపలేక మలుపలేక
ఆలసింపగా నేలా
ఆయాసం పడనేలా ?

నీవధిరోహించిన యీ అల
నిత్యం శాశ్వతము సుమా

నీ కల్పించిన యీకల
నిజం నిజం వాస్తవికం.

అంతులేని యీజీవన
కాంతా రాంతరముల నీ
చింతా దీపం బెంతటి
చిన్ని చిన్ని వెలుగిడినా
అంతేచాలు నంతేచాలు
అంతకన్న లేదు మేలు
ఈ యనంత పరిష్వంగ
మెచ్చటి కచ్చటికే సరి
అజ్ఞాతాజ్ఞేయాలకు
అజ్ఞానంతో నేస్తం!

హేకవేర కుమారికా
శ్రీకర స్రోతః శీకర
లాలిత నిటలాలక! హే
లాస్య చరణ సంచారిణీ!
నందన వాసిని! కవితా
సుందరీమణీ రమణీ!
అన్యాశ్రయములలో నీ
సన్యాసిని మరచిపోమ్మ
నీ నికుంజ సీమలలో
నిన్నారాధించే జనములు
భావుకులూ బంధువులూ
భావియనక భూతమనక
కలకాలం కలలవోలె
వెలిగింతురు నీదు తోట
అమరలోక సంవాసిని
అమృత హాసినీ వాణీ

# శ్రీరంగం శ్రీనివాసరావు

'నగరంలో వృషభం

నగరం నడి వీధిలో
వృషభం తీరు బాటుగా
గత జన్మ సంస్మృతులు కాబోలు
కనులరమోడ్చి నెమరేస్తూ
కదలకుండా మెదలకుండా
నగరం హృదయంలో వృషభం
దారికి హక్కుదారు తానే అయినట్టు
పరిత్యజించి కాలానికి బాధ్యత
పరిహసించి నాగరికత పరుగు
నిలబడింది నేనే రాజునని

ఎవరు పొమ్మనగల రీ ఎద్దుని
ఎలా చూస్తోందో చూడు.
ఏయ్ ఏయ్ మోటారు కారూ
ఏంవిటేంవిటి నీతొందర
భాయ్ భాయ్ సైక్లిస్ట్
భద్రం సుమీ ఎద్దు నిన్ను తప్పుకోదు
యంత్ర విరోధి అహింసావాది శాఖాహారి
మద్యనిషేధ ప్రజ్ఞా శాలి
నగరం నడివీధిలో
నాగరికత గమనాన్ని నిరోధిస్తూ
ఇలా యెంత సేపయినా సరే
ఈ యెద్దు నిలబడగలదు

ఎద్దుకి లేకపోతే బుద్ధి
మనిషి కేనా ఉండొద్దా ?

# కుందుర్తి

## ఉత్తరం

నువ్వు రాసిన ఉత్తరం నిన్న ఉదయం టపాలో వచ్చింది
సరేకాని బిళ్లల్లేవు - పావలా బేరింగు పెట్టిచ్చింది!
బాగున్నావా నేస్తం - యిక్కడ కలరా కొంచెం తగ్గింది.
చీకటి చిత్తైపోయి చివరకు ఉషస్సే నెగ్గింది.
అయినా అంతాక్షేమమని ఘట్టిగా చెప్పడానికి వీల్లేదు
ఆకాశంలో యెగిరే హంసలు, అన్నీ యింకా చెరువులో వాల్లేదు!

అయితే యింకా అక్కణ్ణే ఉందా మీ మదర్?
అబ్బ! యిక్కడ అప్పుల బాధ ఎక్కువైందిరా బ్రదర్.
అక్కడ నీ ఉద్యోగానికి మళ్లీ
జ్వరం తిరగబెట్ట లేదుగదా?

మొన్ననే ఒక మీటింగు జరిగింది—
అడివి మృగాలకు ఆహారం కొరత తీర్చారు
అవకాశాలు అధికంచేస్తూ చట్టాలు మార్చారు.
మనుషులకు తెలివెక్కువైందని పిల్లలకు ఒకపూట బడి చేశారు
మంత్రులు వంతెనకింద ఒకరగంట మట్టితట్టలు మోశారు!

రాబోయే రాజ్యానికి కాబోయే రాజుగారు
వెదకి వెదకి చివరకు మొదటింట్లోనే చేరారు
పట్నంలో వెనుక 'నీల్' విగ్రహం పడిపోయిన చోటికి
యింకా కొన్ని చేరి ఉంపై అంటున్నారీపాటికి!

మెలకువతో పోటీపడి ఓడిన నిద్రాదేవి జాడ
ఎంతవెదికినా తెలే లేదు చివరకు కలలో గూడ
అయితేనేం ? నెమిలి సింహాసనాన్ని మోహించింది కొంగ !
అందరూ తన అందాన్ని చూసి విరగబడి నవ్వంగ ! !

నువ్వు కొనిపెట్టిన కండ్ల జోడు
పగలగొట్టాడు మామూడోవాడు
లైబ్రరీ ముందు సందులోపాడుపెట్టారు ఇల్లు
హస్తం మొలిచిందని ఊరంతా ఒకటేగోల్లు !

ఇటీవల మాకు వానలు బాగానే కురిశాయి—
పండిన గింజలన్నీ తినే హక్కు ఒక తరం వరకు వాయిదావేశారు
హరిజనులు చూడకుండా కొండ మీద గుడి తలుపులు మళ్ళీమూశారు !
వడ్లమరలో బియ్యం బస్తాలు ధరలు పెరగాలని సమ్మెచేశాయి
బెల్లం మిల్లు రాబడిలో గండుజీమల వాటా ముప్పాతిక్కు పెంచారు !

ఎన్నికల వాగ్దానాలు ప్రస్తుతం శెలవలో ఉన్నై
ఈలోగా అబద్ధాల్ని పత్రికలు పెండ్లి చేసుకున్నై
గోడలూ వాడలూ వెల్లవేయడానికి నల్ల సున్నం తయారుచేస్తున్నారు
ఉదయం ముఖాన ఊదారంగు పూయడానికి వీలుందేమో చూస్తున్నారు !
తుపాకులన్నిటికీ పండక్కు కొత్తచొక్కాలు కుట్టించారు
టపాకాయల మందుల్లో యీయేడు గంధకం యెక్కువపాళ్లు దట్టించారు !

మీ యింటి పక్కమునిసిపాల్టీ మురిగ్గొంది
ఎవ్వరైనా పోవమ్మా అంటే ససేమిరా అంది
అప్పుడు నీమీద బురద చల్లిన పంది
యింకా అక్కడ్నే ఉంది !

మొన్ననే విమానంలో వెళ్లి చూసొచ్చాను—
వాన పాము తోకమీద నుంచోని సముద్రాన్ని వెక్కిరించింది

సూర్యుడి మీదికి ఆకాశ రాకాసి చీకటి పుక్కిలించింది.
పాత చిత్రాలే డబ్బు చేసుకుందామని చూస్తున్నారు సినిమావాళ్లు
తారురోడ్డుమీదైనా నడుస్తే తగుల్తామంటున్నై గులకరాళ్లు.

అందని ఆకాశంలో నిగనిగ మెరుస్తుంది చంద్రుడిలో జింక
అదిరాందే అన్నం ముట్టదు తెలిసీ తెలేని కుర్రకుంక !
ఉన్నపొలం ఉన్నపళంగా ఊరందరికీ పంచు
యిది సాధ్యం కాదుటగా – నువు కొంచెం ఆలోచించు !!

మీ యింట్లో ఉన్నవాళ్లు, జీతం ఖర్చుకు చాల్లేదని
నాతో చెప్పారు; యిప్పుడు అద్దె పంపడానికి వీల్లేదని
తెలిసిందిగానీ, యిప్పుడు మీవాళ్లకు ఎన్నో మాసం ?
ఎందుకేనా మంచిదిరా మనలాంటి వాళ్లకు సన్యాసం !

ఇన్నాళ్లూ మౌనంగా ఉన్నందుకు ఏమనుకోవులే నువ్వు
నాగుండె, నీకుతెలుసుగా, వాడిన ఒక లేతపువ్వు
యింకా విశేషాలుంటే యీదఫా ఉత్తరంలో రాస్తాను
యిక్కడ దొరికే పూలన్నీ దండగుచ్చి పంపిస్తాను.
ఈ ఉత్తరం అందేలోగా – రాజుకోకుండా ఉంటే నిప్పు
మ. ఘ. వ. గార్ని – నేను వార్ని – మరీమరీ అడిగానని చెప్పు.

# బైరాగి

## మేలుకొన్నవాడు

నడిరేతిరిని మేలుకొన్న వాడెవ్వడు ?
దివ్వెల నమ్మిక లేమి, నీడల కుట్ర.
చీకటుల మెతక బుద్ధి, ఎవ్వరి కెరుక ?
గోరీ లా అలికిడి లేని గది లోపల
ఎందుకు పడినట్లా వెలుగు మరక ?
గచ్చుమీద విచారాల పచారుల వల,
చిక్కిన పిట్ట ఎగురలేని గడ్డి పరక.

ఎవ్వరి కర్థమౌతుందన్న ?
తెల్లవారి మరొక పొద్దు, ఏముంటుంది అంతకన్న?
గాలి కబురులు విన్నవారు ఇట్టే ఎందుకు నవ్వరు ?
చీకటుల సముద్రంలో జాగారపు చిల్లుపడవ.
సోపానాలు లేని ఉదయ శైలా రోహణలోశ్రమ,
ఇల పేరుకునేందుకు చిరువెలుగుల పీలికల నడవ,
ప్రతి నిముసం ఎవరో తలుపు తడుతున్నారని ఒక భ్రమ.
శూన్యమేధా గృహంమధ్య పిరికి తలపుల ఎలుకల పరుగు.
కుక్కల మొరుగు కేకలిడే మేనపు దుప్పటి చిరుగు.
ఎవ్వరికర్థ మౌతుందన్న, మేలుకొన్న వారికన్న ?
నడిరేతిరి తోడెరుగదు, జాగారం జోడెరుగదు,
ఉన్నారెంతో మంది, నిదురిస్తున్నారంతా,
ధన్యులు వారు, వారెరుగరు ఏచింతా.

వారికే దీర్ఘ యామిని ఒక నిద్రా మధురక్షణం,
ఈ తమసా సంకటయాత్ర వారి నల్లకలువల తూగుటూయల

రెప్పల మొగమల్ మడుగులొత్తిన పథపువిహరణం, కాలహరణం
వారి జగతి వైతరణి తటి కావల
కాని ఈ కూడనివేళ యీ మేలుకోజేసేది,
నిర్భాగ్యుని రెప్పల జేబుల్నుంచి నిద్దుర పర్సు కాజేసేది ?
ఆ మహత్తర ప్రేరణ ఏది ?
అవమానం, అభిమానం, జ్ఞాపకాల కంటకాల ఉపధానం ?
లజ్జాకర జీవితాల కలుష మలిన పరిధానం ?
ఎవరైనా ఎందుకు మేలుకోవాలసలు ఈ నిశలో?
జగత్తంతా నిదురిస్తోంది.
'యా నిశా సర్వభూతాణాం, తస్యాం జాగర్తి సంయతి'
ఒకే ఒక్క తెల్లని చుక్క ఈ మసిలో
ఎవరు కోరరు నిద్రా నీలమానసంలో స్వప్న నౌకల అభియానం?
తరంగాల కోమల పర్యంకంపై శ్వాసల పతనోత్థానం ?

కాని ఇచట ఎవరో ఒకరు మేలుకొనక తప్పదుగదా ?
అనాగతుడు అభ్యాగతుడై అడుగులసడి వినబడి నపుడు,
తలుపెవ్వరు తెరుస్తారు ? ఎవ్వరు పలుకరిస్తారు ?
శాంతి ఉండబోదు సదా, తొలివెలుగుల తెలిరేకుల విడివడినపుడు
ఖండిత గీత గళమెత్తే చారణుడెవడు ?
విచ్ఛిన్న నైశ సైన్యపు ప్రాణ వశిష్ట భటుడు,
అగ్రేసరుల ప్రథమ ధూత, ఆమిషాస్థుల పతనోన్ముఖ
సేతువు మీద ఉదర్కపు ఊహోద్ఘటుడు
అపుడెవరు అడుగుతారు అతడెవడని
నడిరేతిరి మేలుకొన్న వాడెవడని.

# ఆరుద్ర

## గుమాస్తా ప్రేమగీతం

[చెరిగి పోయింది చెరిగి పోయింది
నీ పాదుకల చెదిరి పోయిందట
చిరిగి పోయిందిలే నీవు ఎగరేసిన
నీ మనసులోని నల్లబావుటా
నడచి నడచి వచ్చిందికదా
పాత పద్య పాదాలకి అలసట
విప్పకూడదా మరోపుస్తకం
తిప్ప వెందుకో కొత్తపుట
నీకు ఆసరాగా ప్రేమ నిలబడి
అవుతుందిలే హమేషా బాసట.]

కాఫీకి కవితకీ జ్వరంరుచి వచ్చి
కళ్లూ మెదళ్లూ పరవళ్లు తొక్కి
రాళ్లు నీళ్లుగా, నీళ్లు వడగళ్ల ముళ్లుగా మారి
ఒళ్లంతా తేళ్లూ జెర్రెలూ పాకి
ర్యాళ్ల కర్రలాంటి రూటు మెలికలు తిరిగితే
నో ఓవర్ టేకింగ్ - భావాల స్పీడు పదిమైళ్లు
బస్సు లేటయింది ప్రేయసీ ! మిస్సు అవుతానా
తమస్సులో మన ఎంగేజి మెంటుకి ?
కాచుకుని వాచిన కళ్లు కొంచెం తుడుచుకో
వాచీ దయచేసి వెనక్కి తిప్పుకో ప్రియతమా ! ప్లీజ్ వెయిట్
భ్రమించిన నా సెరిబ్రంలోని కోరికలు తిలకించి
నీ మెడుల్లా ఆబ్లాంగేటా పులకించి పులకించి

నా ప్రేమలేఖల బంగిమీద
నీ అంగీకారాల పోస్టు ముద్రలువేసి
కలలో కలుసు కోడం మానేద్దాం ప్రియురాలా !
పబ్లిక్‌పార్కులో పబ్లిక్ బెంచీమీద
పబ్లిక్ గానే కలుసుకొందాం
సబ్లిమేట్ చేసుకోడం ఎందుకు వాంఛలు
పాబ్లో పికాసో గుయర్నికా బొమ్మలో మాదిరిగా
సూర్య బింబాన్ని బెడ్‌రూం లేంపుతో వెలిగిద్దాం.

హీబ్రూభాషలాగ సవ్వడి చేసే బానిస సముద్రం
జీబ్రాలాగా లైట్‌హౌసు ఆల్‌జీబ్రాలాగ నక్షత్రాలు
అభ్రవీధిలో అభ్రకం శకలంలాగ అశుభ్రజ్యోత్స్న
ఈసురోమని ఇసుకలో కాళ్ళీడ్చుకొనే గస్తీపోలీసు
ఫేసు పౌడరు ఊడిపోతున్న ఆంగ్లోఇండియన్ అమ్మాయి
ఘాయింగ్‌గమ్ము నములుతున్న ఆంగ్లో అబ్బాయి వూయింగ్
పెరఫెక్టు వాతావరణం నెచ్చెలీ కరక్టు ఎట్మాస్ఫియరు

[టాక్సీ వెయిటింగ్ చార్జీలు పెరుగుతున్నాయ్
టేక్సీటులోనే తొందరగా ప్రేమ మాటలు ముగించేద్దామా]
ప్రేమ ఎక్స్‌ప్రెస్ చెయ్యడానికి ఐడియల్ వెదర్ డార్లింగ్ !
సంజె వేళ సముద్ర తీరాన పఠాణీలు కొనడం ఎందుకు
ఐస్‌క్రీం పార్లర్‌లో పీచ్‌మల్బా ఇప్పించనా హనీ !
రోడ్డు వార మూడు మూరల సన్నజాజుల దండకన్నా
ఈవినింగ్ బజారులో క్యూటెక్సుకొని ప్రజెంటు చేస్తా
టెక్నికలర్ హాలీఉడ్ త్రీ-డీ మేటనీకి వెళ్దామా స్వీట్ !
వచ్చే సండేనాడు సింప్లీ మార్వలెస్ సినిమా ఉంది

[వచ్చే ఆదివారం ఓవర్‌టైం పని చెయ్యాలంటాడు
మచ్చుకైనా సింపతీలేని ఆఫీసరాధముడు]

ఇవాళకి ఇక్కడే బీచిలో కూర్చొని జీడిపప్పు తిందాం
చెట్టాపట్టాలు కట్టుకొని కెరటాలు చూస్తూ స్వప్నాలు కందాం

ఇండియా కాఫీ హౌసు మూసేశారు కనుక
నేటికి ఇరానీలో టీ యే తాగుదాం (అదే చౌక)
ఎల్లుండి నారూం మేట్ ఊరికెళుతున్నాడు
ఆవలెల్లుండి ఆఫీసులో ఆఫ్ తీసుకొంటాను
ఇంక్రిమెంటు ఇవ్వగానే పెళ్లి చేసుకొందాం
ఇలాగే ప్రస్తుతానికి కలుసుకొంటూ ఉందాం

[జేబులు ఖాళీ బరాబరు ! కారణమేమిటి ? నెలాఖరు !]
ఆవలెల్లుండి అవశ్యం నా రూము కొస్తావు కదూ
టాక్సీని పంపించెయ్యడం పొరపాటైంది
ఆఖరి బస్సు వెళిపోతుంది లేద్దామా స్వీట్ హార్ట్ !

## బెల్లంకొండ రామదాసు

### నిష్క్రమణం

వెడతాను మరి, సెలవు.
విడిచి వెడుతున్నాను నాకండ్లు
వెలలేని కలల బరువెక్కి
పండి రాలిన పండ్లు
వెదికి వేసారి విశ్రమించిన పుండ్లు
వెడతాను మరి, సెలవు.

ఎన్నో దినాలు గడిపాను మీమధ్య
ఎన్నో దినాలు నడిచాను ఈరధ్య
వెడతాను మరి, సెలవు.
ఎన్నో దీపాలు వెలిగించుకుని వచ్చాను
ఎన్నో కలలు మోసుకుని వచ్చాను.
ఎన్నో జలలు నింపుకుని వచ్చాను.
ప్రవేశించాను
ఈ విచిత్ర భవనంలోకి
ఈ విశాల సదనంలోకి
పాటవలె
పరిమళం వలె
ప్రశ్నవలె
పండు వెన్నెలవలె
పైరు గాలివలె
మాటరాని మౌనివలె —

ఎన్నో ముఖాలు కనుపించినవి
ఎన్నో కండ్లు ఎక్కు పెట్టినవి నాపైన
ఎన్నో గుస గుసలు రుస రుసలు
ఎన్నో కంఠాలు ప్రశ్నించినవి
నీవెవరు ? నీవెవరు ? నీవెవరు ?
నేనెవరు ? నేనెవరు ? నేనెవరు ?

ఏవీ నీ కలలు చూపమన్నారు.
ఏవీ నీ దీపాలు వెలిగింప మన్నారు.
ఏవీ నీ జలలు ప్రవహింప మన్నారు.
తక్షణం మీ ముందు
మంత్రించి నిలిపాను.
వేల వేల చుక్కల చక్కని గగనాన్ని
వెలిగించి చూపాను
విశాల వినీల విశుద్ధ దీపమాల.
ఒక నిమిషం.
విషం వీచింది.
అన్నీ ఆరాయి.

అర్థించాను —
బోధించాను —
తపించాను —
శపించాను —
మానవుడా ! ఇది క్షంతవ్యం కాదుసుమా !
వెడతానుమరి, సెలవు.

భూత కాల భూతశాలపదలి
వర్తమాన విషపర్తులాన్ని భేదించుకుని

భావికాలపు నల్లని ముసుగు ధరించి
వెడతానుమరి, సెలవు.

నాకు లోకం లేదు నాకు శోకం లేదు
నాకు బంధంలేదు, నాకుబాధలు లేవు
ఏదో చల్లనైంది నాలో నేడు
ఏదో ఎన్నడో మరిచింది
జ్ఞాపకం వస్తోంది.
వెడతాను మరి, సెలవు.

వినిపించె నేదో మెల్లని పిలుపు.
మూయండి నావెనుక విశ్వపు తలుపు.

# డిలన్ థామస్

## కాగితం మీద సంతకం చేసిన చెయ్యి

కాగితం మీద సంతకం చేసిన చెయ్యి
నగరాన్ని తెగ నరికింది;
అధికారం వహించిన అయిదు వేళ్లు
ఊపిరి మీద పన్ను విధించాయి.
ద్విగుణీకరించి మరణాల గోళాన్ని,
సగాని కొాక దేశాన్ని కోశాయి;
ఈ రాజు లైదుగురూ కలిసి
రా రాజును బాది చంపేశారు.

మహా శక్తి సంపన్నమైన హస్తం
భుజాల సానువుల వైపు దారి తీస్తుంది,
వేళ్ల కీళ్లు సుద్ద తో కొంకర్లు పోతాయి;
బాతు కలం పరిసమాప్తి చెబుతుంది హత్యకి—
ప్రసంగానికి పరి సమాప్తి చెబుతుంది హత్య

రాజులైదుగురూ చచ్చి పోయిన వాళ్లని లెక్కిస్తారు
గాయానికి మందు వెయ్యరు, కణతల్ని అనునయించరు,
స్వర్గాన్ని శాసించే హస్తంలాగ
జాలిని పరిపాలిస్తుంది చెయ్యి;
హస్తాల కన్నీటివులు లేవు ప్రవహించడానికి

అనుకృతి : శ్రీరంగం శ్రీనివాసరావు

# ఏల్చూరి సుబ్రహ్మణ్యం

ఎన్ని చేతుల నలిగి వాడినది ఆ పువ్వు
ఎన్ని బ్రతుకుల బాధ పంచుకున్నది గుండె
ఎన్ని తుమ్మెదలొచ్చి వాలినవి తేనెలకు ?
గ్రీష్మ హేమంతాల వాసంత నాటకము
ఆడినది, పాడినది, వానలో తడసినది
చీకటుల చిలికినది; చీకటికి, ఆకలికి
చూపినది తీరమ్ము, దీపమ్ము !

పూవు చుట్టూ ముళ్లు. రేకులన్నికళ్లు
రేగిపోయిన కురుల దిద్దినవి చీకట్లు
తెగిన తీగెల మీటి పలికించినది శ్రుతుల
చీకటుల లోయలో, లోయలో, లోలోన
తీసి తీయని తలుపు, సగము మూసిన కన్ను
చీకటికి వేదమ్ము, ఆకలికి భాష్యమ్ము
చెప్పినది శూన్యాన శిలువపై కెక్కించి
కట్టినది కాటుకతో చీకటికి మెట్లు !

అతని నీలిమలోన నైల్యమైనది 'నారి'
అతని అడుగులలోన నడచినది రాత్రి
రాత్రి చీకటిలోన దిద్దు కున్నది కురుల.

# వరద రాజేశ్వరరావు

తేజో హీనమ్ములు, శుష్క పాండురమ్ములు
దీర్ణ ప్రాంతమ్ములు, దైన్య బంధురమ్ములు
నిద్రా ముద్రితములు. నిరయ సంచితమ్ములు
నీ నేత్రాంచలములు, నిత్యవంచితమ్ములు
ప్రేయసి !

సంధ్యాగీతమ్ములు, రాగ రంజితమ్ములు
ఆంధ్య వ్రాతమ్ములు, మృత్యు శింజితమ్ములు
నిర్వాణ ప్రదములు, నిభృత శోక నదములు
నీ సంకేతమ్ములు, నిశిత ఘూకపదములు
ప్రేయసి !

హత్యా నేరమ్ములు, క్షుద్రకుటీరమ్ములు
ఆర్తి స్మేరమ్ములు, దగ్ధ పటీరమ్ములు
నిందా క్రాంతమ్ములు, మంద మారుతమ్ములు
నీ సంకోచమ్ములు, నీలిమావృతమ్ములు
ప్రేయసి !

ఏ భూతమ్మోగతి, ఏ భవిష్య మీస్థితి
ఈ కాలమ్మంతట సంచితార్ధ నిష్కృతి !
నాలో నీవల్లిన భగ్న నిశీ ధాకృతి
నీలో ప్రమోయించును నగ్న నిరాశారుతి
ప్రేయసి !

# అటిలా

ముగ్ధగీత

లేడు నాకు పరమేశ్వరుడు
లేడు నాకు ధరణీశ్వరుడు
తాల్చి యెరుగదు నా
తల్లి నల్లపూసల పేరు !
లేదు గూడు, లేదు పాడె తోడు
బహుదూరం ప్రణయం నాకు
కడుపులో కాళ్లు పెట్టుకుని
కలికి గంజికి వాచి—
ఇరవై యేళ్ల యీడు
జవంతో సత్త్వంతో
విక్రయానికి సిద్ధంనా
వింశద్వర్ష ప్రాయం
కొనే జనం దొరక్క పోతే
అన్యాయానికి అమ్ముడు పోతాను
ఇంగితం సాధనంగా
పాపం పుణ్యం ప్రసక్తి లేకుండా
సాగిస్తాను హత్యలు దోపిళ్లు—

ఉరి కంబాని కెక్కేదాకా
ధరిత్రిలో నిదురించే దాకా
నా నిర్మల హృక్షేత్రంలో
సౌందర్య గరళ సస్యవాటిలో
దుర్గంధం లేచేదాకా

అనుకృతి : వరవ రాజేశ్వరరావు

# ఏల్చూరి సుబ్రహ్మణ్యం

## పడిపోయిన సత్రపు గోడ

ఎన్ని కోర్కెల పెంచి కూలినది ఈగోడ
పాములా కుబుసమ్ము విడిచి వెళ్లినదెటకో ?
చెరిగినది కలగాదు, వొరిగినది ఈగోడ
లేదింక ఈ వాడ నిండు వెన్నెల జాడ !
ఆకలితో పెరిగినది, దప్పికతో పలికినది
వెన్నెలా, వెన్నెలల కన్నులా పొంగు తరగలలోన
జలతారు జాలులా పొరలి వచ్చిన తల్లి
రాదింక ఈ వాడ, పాడు పడినది రేవు !
జాలరీ ! వల నింక విసర కీనాడు—
పాంథుడా ! పడుకోను అరుగు లే దిచట !

కంకులట్టుల మనల కూర్చినది ఇచ్చోట
నూర్చినది, వంతలను చింతలను—
వంతలను చింతలను తూర్పార బట్టినది
సంజ కెంపులలోని భోగి మంటలలాగు
చలి తీర్చినది తల్లి !
అడుసు నంటిన బురద కన్నీట కడిగినది
తాను తీసిన తలుపు వేసినది ఏనాడు ?
ఆకొన్న వారలకు లేదన్న దేనాడు ?
చెరిగినది కలగాదు వొరిగినది గోడ !
గాయపడినది కరుణ
పాడినది ఒక పాట, తంతులన్నిటిచేర్చి
మ్రోగినది ఆ వీణ.

ఒక్కొక్క రొక లోకమై వెలసి నారచట
ఆలోక పవలోకనములోన గుండె బరువులదించి
పవనమ్ములై, పక్షులై గగనమ్ములో కెగిరి
అర్ణవపు టంచులై నింగి దిగివచ్చారు.
అవని వెన్నెలజాలు ఆ తల్లి చలువ !
లేదింక ఈ నాడు నిండు వెన్నెల జాడ !

ఆమె విరిచిన విల్లు, హరివిల్లు,
ఆమె కట్టిన గోడ నీలి మబ్బుల మేడ
పొలము లన్నీ పండి, పంట వారిగుండ
ప్రళయా నిలమ్మట్లు కాటకమ్మేరాగ
---అంతెరుగని అర్ధరాత్రి
చీకటి విరబోసుకుంది,
దూర దూర తీరాలను చూపదు చుక్కాని
పెనునిద్దర ఊరంతా క్రమ్మకుంది చీకటి
కాళ రాత్రి బరువెక్కిన ధరిత్రి
పచ్చ పచ్చ పంట చేల ప్రాణం పీలుస్తున్నది
పెదవి విప్పని అడవి వేడి నిట్టూర్పులతో
కూలినది ఈ గోడ !
అచల వేదన లేవా కరడు కట్టిన వికట,
విరిగి పడినది కొండ, అవనిపై మిన్ను !
లేదింక ఈ వాడ, నిండు వెన్నెల జాడ !

# కవిరాజ మూర్తి

ఓ నా సుందర సురుచిర స్వప్నం
ఎక్కడ నుంచి ఈ నీ ప్రయాణం ?
—సూర్యాస్తమయ శోభల నుంచా
సూర్యోదయ కాంతుల నుంచా
కమ్మని కలువల చేరుల నుంచా
ఎక్కడివీ సుమ పరిమళమ్ములు ?
....జైలంటే నాకూ భయమే
ఈ మురికి ప్రపంచములో
సౌందర్యం మరణించక బ్రతకదా ?
రంగులేదు, రూపులేదు, కళలేదు
కాంతిలేదు కేవలంతుదర్రిం – మరీదరిద్రం.

నిన్నెక్కడనో చూచానమ్మా
ఆపల్లెపిల్ల కనుకొలకుల్లోనో
ఆ నక్షత్రపు మిణుకుల్లోనో
ఆతల్లి కని పాపల ఆశల్లోనో
ఆ పిల్లచేతి మట్టి బొమ్మలోనో
ఆబొమ్మ పలికే మూగ భాషలోనో
నిన్నెక్కడనో, ఎక్కడనో చూచానమ్మా !

'అనగా అనగా ఒక రాజు
ఆవూళ్లోనే ఒక రాణి '—
అందమైన ఆ కథను వినేందుకు

అమాయక హృదయాలు ఎన్ని, ఎంత
ఆతురతను ప్రకటించాయో
ఆ అందాల సీమనుంచి, ఆనందాల కోవనుంచి
అటునించా నీ అనురాగాల ప్రయాణం ?

ఆకాశంలో ఇంద్ర ధనుస్సు అగుపించినపుడు
మలయమారుతం మందంగా వీస్తున్నపుడు
మద్యంలోని మధువు శరీరాన్ని మైమరపిస్తున్నపుడు
ప్రథమ సమాగమంలో పెదిమలు కలసినపుడు
తరుణీ నవయవ్వనం పై తరణిలాపొంగినపుడు
కాటుక చీకటిలో ఆమె కండ్లు కాంతుల ప్రభవించునపుడు
కాటుక చీకటిలో ఆమె కండ్లు కాంతుల ప్రసవించునపుడు
—అపుడు వెండి కొండలా సాక్షాత్కరించావు,
అతి సుందరమైన నా స్వప్నం !

"కవిత్వం కవులకోసం; వ్యంగ్య కల్పనలు
రసజ్ఞులకోసం; తదితరులకోసం
గద్యం రాస్తాను. కవులు కానివారి కోసం
కవిత్వం రాయటం నిరర్థకం".

— రాబర్ట్ గ్రేవ్స్.

# రా జ శే ఖ ర్

౧

పంక్తిలో పీట లేదు రోడ్డు మీద దారి లేదు
ఇంటిలో ఆలి లేదు బిడ్డ నోట పిలుపు లేదు
సంతలో వింత లేదు అంతలోన యింత లేదు
రక్తిలో వంతు లేదు ముక్తిలోన పాలు లేదు

పక్షులకు కోవెలలు కట్టలేను
శోకాల గోళాలగతి మార్చలేను
నదిలా తీరాల తీర్చి దిద్దలేను
వృక్షంలా పరిమళం సృజించలేను
కీడు మరిచి మనలేను
నీడ విడిచి నడవలేను

జ్ఞాపకాల బాటలో చెట్లపేర్లు చెప్పలేను
దిగుళ్ల కోనేటికి దిగుడు మెట్లు కట్టలేను
కోర్కెల కుక్కి మంచంలో కునుకు తియ్యలేను
ఆకళ్ల గ్రీష్మాల రక్త దాహం తీర్చలేను
నిస్పృహల హేమంతాలకు చలిమంటలు వెయ్యలేన
నిరాశల శిశిరాలకు కాయ కల్పం చెయ్యలేను

కూలుతున్న ఆకాశాల శోకం
భుజస్కంధాలు మొయ్యలేవు

సంశయాల చిట్టడవిలో చిక్కుకున్న
మిణుగురుప్రాణం చీకటి కన్ను విప్పలేదు
పాపాల అభ్యంగనస్నానానికి
కనికారపు కన్నీళ్లు కార్చలేను
మసినాల మౌనం
నామదిలో పద్యాలు పలికించదు
అక్షరాల అవతారాల దాల్చి
నా ఆవేదన వేదాలు వర్షించదు.

నా జన్మలగ్నం పుడమికే పీడకల
పేదరికంలా బిగుసుకున్న ఆకాశం
నాపైన కనక వర్షం కురిపించదు.
స్వగతాల పలవరించే దేవతలు
నాతో సంభాషించరు
వాయువుల్ని పలకరించే కాలం
నాకు రహస్యాలు బోధించదు.

రంగస్థలం పైన ప్రేక్షకులముందు
నా పాత్రను నేనే మాత్రం ఒప్పించలేను
గుండెలో దారి తప్పి స్వగతాలు వెలికి రాలేదు
సంభాషణల అవసరం అకస్మాత్తుగా అదృశ్య మైంది
వేషం వేసిన నాయిక కళ్లలో వృద్ధాప్యం బుసలు కొట్టింది,
కత్తిదూసిన శత్రువు వదనం అతి దీనంగా విలపించింది
నేపథ్యంలో ప్రియురాలి శిరోజాల వరదలో
నాశోకాల ముంపు నెవరూ గమనించలేదు
అంతేచాలు, నా కంతేచాలును
అనర్థపు బ్రతుకున కర్థం వెదుకుతూ

అడవి మార్గాల్లో తప్పటడుగులు వేస్తూ
ఎరగని గమ్యం మరవక నడిచాను
ఆరోహించని ఆదర్శాల జ్వాలాముఖిశిఖరం కల్లెత్తిచూశాను
ఆలపించని గాంధర్వ సాగరాన్ని నామూగ శంఖంలోదాచాను
మరి నా వెనువెంట
ఇన్ని కోలాహాలు పరుగు లెత్తుతున్న వెందుకు,
ఫాలనేత్ర జ్వాలల నాట్యం నాచుట్టూపురి విప్పుతున్న దెందుకు?

ఊరంతా విద్యుద్దీపాలు ఆరిపోయిన
నా ఉపవాసాల అమావాస్యల్లో
కూలిన విశ్వాసాల శిథిలాగారంలో
ఒంటరినై రచిస్తున్నాను
నా శ్వాసల ఆశ్వాసం

మూడు కోర్కెల మనిషిని
కనికరించి నా కన్నువిప్పు !

నీ సుడిగుండంలో నారేణువును కదిలించకు
నా కత్తుల బోనులోని విపత్తులకు నిద్రను మోసుకురా
పీడకలల కంఠంలో చెరపడ్డ బ్రతుక్కు శబ్దముక్తి ప్రసాదించు
కొమ్మలలో రెక్కల కోలాహలం చెలరేగుతున్న
సాయంత్రాలపైన నిశ్శబ్దాల గూళ్లుకట్టు
ఆకాశస్తంభాల పిలుపులో
నాకడలికి తీరం చూపించు
విచ్చుతున్న మొగ్గతో రాలుతున్న ఫలం

పలికిన వాక్యం వ్యాఖ్యానించు
వంశవృక్షాల నీడలు వాలని ద్వీపంపైన
ముందు నడిచిన పాదాల జాడలు చూపించు
నా బ్రతుకంతా ఒక చెడిన వ్రతం
అందుకోని సందేశం
గుడి చేరని యాత్రిక చరణం
తెగపూసిన విహ్వలతల వ్యాకులతల, విషలతల కీకారణ్యం

౨

కాలం ఒక కన్నీళ్ల కాల్వ
బ్రతుకొక కన్నీళ్ల కాన్క

పగలల్లా తలుపు తట్టిన నీకు
సందిగ్ధాలు ముసిరిన సాయంత్రంవేళ
తెరుచుకుంటుంది సౌధద్వారం
కానీ దీపాల ప్రాణాల్ని
దొంగిలించుకు పోతుంది రాత్రి

మలు సంజెల కూడలిలో
లోకంతో విడిపడి నీ దేహం
కలలా మాసిపోయే వేళ
కనిపించే దల్లా మిలమిలలాడే
తీరని శేష సందిగ్ధం
ఆక్షణ మొకటే
భూత భవిష్యాలంటని వర్తమానం
ఆక్షణం, క్రితంక్షణంలో పుట్టలేదు
ఆక్షణం, మరుక్షణంలో చావబోదు

ఆక్షణాన నువ్వూ దీపం పట్టుకుంటావు !
గడిచిన దంతా దిగ మింగి
ఆక్షణం నీ దనుకో ! !

బాట పొడుగునా మైలురాళ్ల కళ్లు
బాట పొడుగునా గడియారాల ముళ్లు
బాట కిరువైపులా స్ఫటిక సౌధాల కళ్లు
బాట పొడుగునా కాళ్ల కింద ముళ్ల నోళ్లు
చూడ లేని ఆమేలుకొన్న కళ్ల మధ్య
ఈ చిర తీరంలో ఎంత నడిచినా
గమ్యం దిఙ్మండల నేపథ్యంలోనే నిక్షిప్తం

అంతేగాక ఈ శీతల సౌధంలో
ఎంత నిశ్శబ్దం నిండుకుందో ఆలకించు
ఇదెన్నడో రైలు నడిచిన పచ్చిక బయలు
ఇదీనాడు అంచులేని వరదల పిచ్చిదాని నోరు
లోయలో జారిపడ్డ చీకట్ల కొండ
కాలువిరిగిన చైతన్యాల మూల్గుల కదలి.

ఒక్కసారి కళ్లెత్తి చూడు——
ఆ రెండు పక్షుల రమ్యానురాగం
అంతరిక్షంలో సందర్శించు
ఆ జనన మరణాల నిద్దంపు జంట
ఒక్కసారి కళ్లెత్తిచూడు——
పైనున్న ఆకాశం
ఆ విప్పిన తాళ పత్రంలో
కాలం అల్లిన మహా కావ్యం

చదువు—
తనువు మాడ్చి
ఆత్మ తార్చి
భాష నేర్చి
భాష నోర్చి
చదువు—

అర్థం అర్థించక ఆలోచించు
కాలం అనంతమయినా
మానవజాతి జీవితం మాత్రం కాదు,
చీకటిలో చితిలా
కొన్ని గడియల పాటు
ఆలోచనల మంటల మధ్య
జీవించు !

కట్టే బట్టేగాని చేరే ఊళ్లులేవు
వేచే కళ్లేగాని చూచే దృశ్యాల్లేవు
కురిసే జల్లేగాని పండే పంటల్లేవు
విరిసే రాత్రేగాని నిండే వెలుగుల్లేవు

సానిదాని స్వగతంలో విరిగిన గాజు కలలా
చివరకు ఏదీసవ్యంగా సంతృప్తిగా పరిణమించదు

నీడలో నిద్రను అభిసరిస్తున్నావు
గోడల మధ్య ప్రవాసిస్తున్నావు
పీడలు నిన్ను నవ్వులపాలు చేస్తున్నవి.

రాక పోకల రహదారిలో
క్షణమైనా కాలుమోపక పరిభ్రమిస్తున్నావు

మనిషీ !
నీ ఇల్లెక్కడ?
ప్రయాణీకుడా!
ఏ దెసకు నీ మేఘ యాత్ర?
ఏ కాలపు సరిహద్దున
మేలు కొనేందుకు నీ ఘోషశోష?

తల్లిబొడ్డుకత్తిరించి
నేలపడిన శోకానివి
శూన్యంలో పడ్డ
ప్రకృతి బిడ్డవు
మాతృ గర్భానికి
సేతువు కూలిచి
నువు వరమందిన ప్రవాసాస్థిక
నాస్థికత్వపు జీవిత గ్రహణానికి
విడుపు లేదు ఈ కాలపు ఖైదులో
మృదులాతి మృదులమై
నాడా గర్భ గోళాంత రంగాన
నిను తాకిన చీకట్ల చీకటిని
మాన్పు విద్యు ద్దీపాలు లేవు
నవ మాసాలు నిను ముంచిన
నిశ్శబ్దపు కెరటాల ఘోషను
మరిపించు శబ్దార్థపు కడలిలేదు
ఈ శప్త ధాత్రి పైన
సృష్టిలో శేషించిన
మానవావతారం చాలించి
పిడికెడస్థికలు
పుడిమికి సుంకం చెల్లించుకు

తరలిపో —

కనిపెంచిన
తల్లి ముఖాన
కన్నీళ్ల కైసేత
తిరిగి చూడక
తరలిపో —

మమతలు కదలించవిక
దేహాన్ని
మస్తిష్కం వేధించదిక
అస్థి పంజరాన్ని.
నీవై నిన్ను సేవిస్తవి
నాలుగు కాలాల పాటు
అంధకారం, నిశ్శబ్దం, ఏకాంతం.

"అహం వృక్షస్య రేరివా
కీర్తిః పృష్ఠం గిరే రివ
ఊర్ధ్వ పవిత్రో వాజి నీవ స్వమృత మస్మి
ద్రవిణగ్ం సువర్చసమ్
సుమేధా అమృతోక్షితః......"

— త్రిశఙ్కు మహర్షి

# టి. ఇ. హ్యూమ్

వీణా తంత్రీ తంత్రంలో
పరవశం పొందా నొకసారి
కరకు కాలి బాటపయి
మెరసిన
కాంచన పద విద్యుత్ప్రభలో—
ఇప్పుడెరుంగుదు
కవితకు కవోష్ణం
మూలపదార్థం

ప్రాత వడిన
తారా ఛిన్న గగన శాటిని
చుట్టూ కప్పుకునేందుకు
సుఖంగా శయ నించేందుకు
ప్రభూ ! పరిమితం చెయ్యి

# వరద రాజేశ్వరరావు

౧

చెరగని స్వప్నం, కరగని వేదన :
చెదరిన భావికి లోకం చేదన
లోలో రేగే మాయని వలపులు
ఆలాపించే తీయని తలపులు
మండే గుండెను మరింత వేల్చగ
నిద్రిత భూగర్భంలో దాగిన
నీరవ సమాధు లందున రేగిన
చరమాహ్వానం పరచిన పిలుపున,
మరణావరణం లోపలి నలుపున
గజ గజ వొణికే కళేబరానికి
కన్నీళ్లెందుకు ? కష్టందేనికి ?
వెనకటి దశలో విరిసిన రోజుల
వెదకిన దొరకని స్వర్గపు మోజుల
గుణించు కుంటూ, గణించు కుంటూ
కొన్నాళ్లయినా కలల్ని కంటూ
కాలం పన్నిన వల కీవలగా
గగనం మలచిన కల కావలగా
దైనిక జీవన వైరుధ్యంలో
ధార్మిక చింతా నేపథ్యంలో
విచలించేనా ? విలపించేనా ?
విషాదగీతం వినిపించేనా ?

ఏ దెసచూస్తే ఆ౯ెన స్వార్థం
ఈ పరమార్థపు శోధన వ్యర్థం !
జీవితమంతా తాత్త్వక బద్ధం
శిశూదయాన్నే మృత్యువుసిద్ధం !
మనుషులు పుట్టుట గిట్టుట కొరకే
మనుగడ జగడం అంతటివరకే.

ఆస్కారంలేదిట ముందంజకు
అనురాగం లేదీ మలి సంజకు !
ఆక్రోశాలూ అవేశాలూ
ఆశాలోకపు టాకాశాలూ
సంకేతాలూ, సంబంధాలూ
సందేహాలూ, నిర్బంధాలూ
బళ్లో వెలసిన ఉద్గ్రంధాలూ
గుళ్లో విరిసిన దుర్గంధాలూ
స్వాంతం తొడుక్కునే సంకెళ్లవి
ధ్వాంతం తాల్చిన కాలం కళ్లవి !

వీటిని గురించి ఆలోచిస్తే
వెనకా ముందూ మధ్యను కాస్తే !
బ్రతుకును కొలుచుకు లాభంలేదిక
చితికిన కోరిన ఫలించ బోదిక

౨

ఏది నిజం, ఏది నిజం
ఏనాటిది నీ సంగతి
ఎప్పటిదా ఆనందం ?
ఏ బాటలు, ఏ తోటలు

ఏ సందులు, ఏ గొందులు
ఏ వేటలు, ఏ పాటలు
ఏ వెన్నెల, ఏ చీకటి
ఏ వైరం, ఏ నేరం
నీకేఁవిటి గుర్తున్నది
నేస్తం ! నీకేం గుర్తూ ?

ఎంత మంచి దా కాలం ?
ఎలుగు చించితే మాత్రం
మళ్లీ యిటు వస్తుందా ?
మళ్లీ యిటు వస్తుందా ?
మందారం పూస్తుందా
సిందూరం రాస్తుందా
చెరిగిపోయి మాసిపోయి
చెమ్మగిలని ఎదలోపల !

గతం నిజం, నిజం గతం
రుతం లేని మృతం కాని
గతం నిజం, నిజం గతం
కలకాలం నిలుస్తుంది
వర్తమాన మెంత భయం
ఉప్పొంగే వరదలాగ
ఉప్పెనలా ఎంత భయం ?

క్రమిస్తున్న యీ వయస్సు
భ్రమిస్తున్న యీ మనస్సు

రక రకాల సమస్యల్ని
శక శకాల సంశయాల్ని

తెచ్చిపెట్టు కుం...న్నది
తెంచేందుకు సాధ్యపడదు

ఎవరైనా ఉన్నారా ?
ఈ చీకటి చించేందుకు
అమరత్వా న్నందరికీ
అమృతంలా పంచేందుకు ?

మృత్యు వొకటి లేకుంటే
ప్రత్యూషం సాయంత్రిం
ఈ లోకాన్నా వరించి
ఇందాకా రాకుంటే
శైశవమూ వార్ధక్యం
సన్నిహితం కాకుంటే
ఈ రెంటిని విడదీసే
ఏ భవిష్య భాష్య ముంది ?

కానలేని సౌఖ్యానికి
లేనిపోని అనుమానం
చిన్ననాటి హృదయంలో
చిగిరించిన ఆశయాలు
ఊహల్లో ఉండిపోయి
ఒకటైనా తీరలేదు.

మన చుట్టూ తిరుగాడే
మనుషుల్లో ఎవరాప్తులు ?

బాల్యంలో నువ్వెరగవు
బాధల్నీ వేధల్నీ

పూచీ యేముంది నీకు
పుణ్యానికి, పాపానికి ?
శైశవాన ఆశ లెగసి
స్వర్గాలూ నరకాలూ
చావు బ్రిదుకు, చేదు తీపి
ఆవు పొదుగు సలుపరింత
రేవుపక్క యేటి పోటు
దిగుడు బావి నీటి కరువు
దిక్కెరగని గుండె చెరువు
నీ కర్థం కాని కథలు
నేస్తం! నీకనవసరం!

వలయంగా విలయంగా
పరిభ్రమించే భూమికి
నువ్వెవరివి, నువ్వెవరివి—
దవ్వెరగని దీ జీవం!

అమ్మా నాన్నా ఉండే
ఆ రోజుల జ్ఞాపకాలు
వ్యూహంపన్నే బుద్ధికి
దాహంతీరని కాలం
మళ్లీ రాదని తెలుసును
స్మరణలోన మరణ ఘోష!
జనన మరణ గతుల మధ్య
క్షణక్షణం వర్తించే
అతి సుందర గరుదంచల
శతసహస్ర వర్ణ కిరణ

మహోజ్జ్వలిత మీజీవన
విహంగం !

3

అసలీ వయస్సు
కుసుమిస్తుందా ?
ఏటిని దాటగ
ఈ తీరం దిగి
ఆ తీరానికి

ఆటంకాలను
అవరోధిస్తూ
ఆ గమనంలో
ఆ ఖేదంలో
ఆ యాసంలో
ఆ నందాన్నే
ఆరాధిస్తూ

చేరటమే యీ
జీవిత లక్ష్యం !
అసలీ వయస్సు
మెసలే దెక్కడ ?

4

అజ్ఞాతాన్నీ, అనంతాన్నీ
ఆదినుంచీ అవిరళంగా

ధ్యానిస్తున్న పూజిస్తున్న
దరిద్ర దీన హృదయులంతా
భ్రష్టమతితో దురదృష్టాన
భావించారు జగతి దుర్గతి
శాసించారు జనత ప్రగతి
శాశ్వతంగా జన్మ జన్మకు
అంచేతనే సంకోచాల
అంచవాల్లో జ్ఞానవంతులు
మెదళ్ళే చించు కుంటున్నారు
మొదలే చిత్త స్వస్థత తప్పి
ఇహంలోపల దుస్సాధ్యమై
అహం చంపుక పరం కోసం
ఒకటే ధ్యాస ఒకటే బాధ
ఆత్మవంచన చేసేందుకే
అవసరమైంది యీ పరమాత్మ
భగవంతుణ్ని సృష్టించింది
ఫరవాలేదు పాపాలకని !
వయః పరిణామానికేమిటి
పరమార్థం ప్రమాదం తప్ప !

వయోమధ్యపు పెల్లల
వల్లమాలిన చీకటి
భయం దేనికి నేస్తం !

అయోమార్గపు టంచుల
అందరానిది వెలుతురు
తొందరెందుకు నేస్తం !

ఆవరించిన తమస్సు
తీవరించే వయస్సు
జీవితమ్మిది నేస్తం !

క్రీళ్లు సడలిన తనువున
ఏళ్లు గడచిన మనుగడ
కెంత సౌఖ్యం నేస్తం !

ఇంద్రియాలను త్యజించి
హృదయ నేత్రం విప్పగ
ఏది చీకటి నేస్తం !

వయో మధ్యపు టాకలి
వర్తమానం తీర్చదు
వర్ధ మానం నేస్తం !

కీర్తి శేషం బాల్యం
ఆర్త వేషం వేసుక
ఆగమిస్తే నేస్తం
ఆ సమక్షపు శైత
ల్యావేద నా వరణ
మ్మందు నిల బడు నేస్తం !

భయంకరపు భవిష్యం
భాద్రపద మేఘంలా
పలకరిస్తే నేస్తం
ఆ సమక్షపు కైవ
ల్యావేద నా వరణ
మ్మందు నడు గిడు నేస్తం !

# అజంతా

రోజూ చూస్తూనే ఉన్నాను
ఆకళ్ల వెనుక ఉమ్మెత్త చెట్లను, ఊసర క్షేత్రాలను
ఉద్రేకవంతమైన సరస్సులను, ఉరితీయ బడుతున్న అక్షరాలను

రోజూ చూస్తూనే ఉన్నాను
రోజూ నడుస్తూనే ఉన్నాను
ఆకళ్ల వెనుక తాళ వృక్ష ప్రమాణంలో ఎదురయే భయాల మధ్య
భయంకరమైన ఊరువుల మధ్య
మండుతున్న మధ్యాహ్నాల మధ్య
మందార పువ్వుల మధ్య

రోజూ చూస్తూనే ఉన్నాను
రోజూ నడుస్తూనే ఉన్నాను
అవధారణ చేస్తూనే ఉన్నాను
ఆకళ్ల వెనుక అప్పుడే భూపతనమైన ఏడుపును
శాఖోప శాఖలుగా వ్యాప్తమయే గర్భఘోషను
కొమ్మక్రింద కన్నీళ్లలో నిష్క్రమణ గీతాలను

రోజూ చూస్తూనే ఉన్నాను
రోజూ నడుస్తూనే ఉన్నాను
అవధారణ చేస్తూనే ఉన్నాను
ఆకళ్ల వెనుక దీపం వెలుగదు
అక్కడ సంగీతం వినపడదు.

# ఛాయ

ఆకాశం మీంచి అవనీతలానికి
అవరోహించకు అమాయకంగా !

ఆనందం, సుఖం
అనుభవించాలని
ఆలోచించకు
ఆకాంక్షించకు !

ఆవేశం పొంది,
అపరాధంచేసి,
ఆహుతి చెయ్యకు
ఆ అమరత్వం !

ఆ లోకం లోని
అమరులకే కాదు
ఆ శాసనాలు,
ఆ ఛేదనాలు !

అధికారం పెరిగి,
అన్యాయం మీరి,
అవనిలో శాంతి
అంతరించింది !

అంతరంగంలో ఆక్రందిస్తున్న
అహాన్ని మాత్రం ఆరాధించకు !

అజంతా

ఎక్కడా ఎవరూ లేరు అంతా ఇళ్లు జేరుకున్నారు
విద్యార్థి పుస్తకాలు మూసేశాడు
విదూషకుడు వేషం మార్చేశాడు
వీధిగాయకుడు పాట ఆపేశాడు
ఎక్కడా ఎవరూ లేరు అంతా ఇళ్లు జేరుకున్నారు

హంతకులు కత్తులు మూల బెట్టారు
రాక్షసులు పాతాళ బిలం జేరుకున్నారు
రాజ్యాధిపతులు నెత్తురు చేతులు కడుక్కున్నారు
ఎక్కడా ఎవరూ లేరు అంతా ఇళ్లు జేరుకున్నారు

అంతా ఒకసారి అద్దంలో ముఖాలు చూసుకున్నారు
అగాధంలో ఏఁవుందో తెలుసుకున్నారు
మృత్యువు నోరు తెరవక ముందే తలుపులు మూసుకున్నారు
ఎక్కడా ఎవరూ లేరు అంతా ఇళ్లు జేరుకున్నారు

గుడిసెలో వెన్నెట్లో కార్మికులు కన్నీళ్లు ఆరబెట్టుకున్నారు
కట కటాల మధ్య శూన్యంలో ఖైదీలు ఆకాశయానం చేస్తున్నారు
పేవ్‌మెంటు మీద భిక్షకులు వాల్ పోస్టర్లు పరుచుకున్నారు
ఎక్కడా ఎవరూ లేరు అంతా ఇళ్లు జేరుకున్నారు

జీవిత అవశేషాన్ని అంతాభద్రంగా తాళంవేసుకున్నారు
కచేరీ గుమాస్తాలు ముళ్ల కంచెల దుప్పటీ కప్పుకున్నారు

ఈతి బాధల సంచీని తలగడాల క్రింద దాచుకున్నారు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా నిద్ర పోతున్నారు

రాజులు రారాజులు రాక్షసులు రాజకీయ వేత్తలు,
సామాన్యులు, సజ్జనులు, అందరూ నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అందరూ తలదాచుకున్నారు
జెండాలు ఎగరవు ఇప్పుడు
శాసనాలు చెల్లవు ఇప్పుడు
గడియారాలు ఆడవు ఇప్పుడు
ఆలోచనలు సాగవు ఇప్పుడు
ఎక్కడా ఎవరూ లేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

హంతకుడికీ బలిపశువుకీ ఇప్పుడు తేడాలేదు
కురూపికీ స్ఫురద్రూపికీ ఇప్పుడు తేడాలేదు
మనిషికీ మనిషికీ మధ్య ముళ్ల తీగలేదు
పిల్లీ ఎలుకా ఇప్పుడు శత్రువులు కావు
ఎక్కడా ఎవరూ లేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

ఆలోచనల తోడేళ్లు ఎవర్నీ వెంటాడవు ఈరాత్రి
జీవితమనే పెద్దపులి ఎవర్నీ భయపెట్టదు ఈరాత్రి
ఎక్కడా ఎవరూలేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచు కున్నారు

కోరికల కత్తుల బోనులో మూలుగులు వినబడవు ఇప్పుడు
జ్ఞాపకాల చీకటి గుహలో కన్నీళ్లు రాలవు ఇప్పుడు
ఎక్కడా ఎవరూలేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

గోముఖ వ్యాఘ్రాలకు చీకట్లో కంత్లు కనపడవు
పరకాయ ప్రవేశవిద్య చీకట్లో ఫలితం ఇవ్వదు
రాజకీయ వేత్తలకు ఈ రాత్రి ఆహారం లేనేలేదు
ఎక్కడా ఎవరూలేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచు కున్నారు

ప్రపంచంమీద గొడ్డళ్ల చప్పుడు రేపుగాని వినబడదు
భూగోళాన్ని చుట్టపెట్టే మనుష్యులుచీకట్లో ముష్టియుద్ధం చేయలేరు
యుద్ధమేఘాల గ్రామఫోన్ సంగీతం ఇప్పట్లో ఎక్కడా వినబడదు
ఎక్కడా ఎవరూలేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

పోస్టు బంట్రోతుల భయం ప్రొద్దున్నేగాని ఇప్పుడులేదు
హంతకుడు పోస్టుచేసిన వుత్తరం రేపుకాని అందదు
దేశాలపాలైన కొడుకుల సంగతి ఏతల్లినీ ఇప్పుడు కలతపెట్టదు
మిత్రుడు ద్రోహంతలపెట్టినా ఇప్పట్లో అది ఎవరికీ తెలియదు
ఎక్కడా ఎవరూలేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

కచేరీ గుమాస్తాల ఇళ్లలో ఈతి బాధల గ్యాలరీ ఇప్పుడు కనబడదు
అప్పులవాళ్ల బాధ ఎవర్నీ ఇప్పుడు వెంటాడదు
ఆడపిల్లల పెళ్లిళ్ల సమస్య ఏ తండ్రినీ ఇప్పుడు వేధించదు
ఎక్కడా ఎవరూలేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

ఆశలులేవు అసూయలులేవు నిరాశలులేవు
నిట్టూర్పులులేవు ద్వేషాలులేవు
దురాగతాలులేవు కష్టాలులేవు కన్నీళ్లలేవు
అంతటా ఒకే ఒక నిశ్శబ్దం
ఒకే ఒక హృదయ స్పందనం

# డి. హెచ్. లారెన్స్

ఎంత విశాల శ్యామల హస్తాలవి
సంధ్యా మారుతాన్ని ఛేదించి సాగిపోవు
స్వర్ణ కాంతిని గ్రహించు గవాక్షమందున్నవి
అంత ఆహ్లాద పడునట్లు నాహృది !

నిష్క్రమణ మొక్కటే !
నేను పశ్చిమాన్ని
అవలోకించాను
అకస్మాత్తుగా
ఆ విర్భవించిన
అరుణ వర్ణాన్ని
ఆందోళిత సంధ్యా వక్షంలో—
పయనమైంది గృహానికి
ప్రణయ వ్రణం !

అనుకృతి : ఛాయ

# రాంబో

చిరిగి పోయిన జేబుల్లో చేతులాడించుకుంటూ
తిరుగు తా నెక్కణ్నో;
కప్పుకున్న బొంతకు గుడ్డ కన్నా కంత లెక్కువ
విప్పుకున్న గగనం కింద కవిత్వాని కూడిగంచేసే బానిసని :

వెదజల్లుతా నెన్నో ఉజ్వల ప్రణయ స్వప్నాలు :
ఉన్న ఒక్క లాగూ మోకాళ్ల మీద చిరిగి పోయింది
ఆకాశంలో ఆశ్రయ చిహ్నంగా చంద్ర బింబం విరిసింది
పట్టులా మెరుస్తున్న నక్షత్రాల హాసం
పతానీల్లా ప్రాసల్ని ఒలుస్తున్న స్వప్న జీవిపై కురిసింది

మైకం కల్పించే హిమకణచషకంలో నానుదురు తడిసింది
భాద్రపద రాత్రుల దారి ప్రక్కల వింటున్నాను
ముట్టడించినవి నన్ను వెర్రి నీడలు
పద్యాల కోసం వెదుకు తున్నట్లు
చిరిగి పోయిన చెప్పుల్లో కాళ్ల దూర్చుకుని
హత్తు కుంటాను హృదయానికి ఒక పాదాన్ని వీణలా :

అనుకృతి : వరద రాజేశ్వరరావు

# కవిత

౨

సంవత్సరానికి
మూడు
సంపుటాలు

సంకలనం:
అబ్బూరి ఛాయాదేవి

ప్రతి రూపాయున్నర

## శ్రుతి

బ్రతికి యున్న వారికన్న .
చచ్చిన వారే యెక్కువ
కద ! ఈ యల్ప సంఖ్యపై
ఏలా నీ కీ మక్కువ ?

అనలేదా కాళిదాసు
అజవిలాప గాథలోన
" మరణము ప్రాణులకు ప్రకృతి
జీవితమే వికృతి, కాన

క్షణమైనా ఊపిరితో
జీవించే యెడల ప్రాణి
మహాలాభ మనుకోవలె
ఇదే బుధోత్తముల వాణి "

పైరుపండి రాలినట్లు
ముసలియై లయించు జీవి
రాలి మరల వచ్చు ననుట
రమ్యమైన యెండమావి.

వచ్చేదొక కొత్తపైరు
పండేదొక కొత్త పంట
దీనిపైని శ్రద్ధలేక
దానికేల కడుపు మంట ?

ఏమన్నా నేటి కన్న
రేపటి విలువే తక్కువ
అందువల్ల కానోపును
అల్ప సంఖ్యపై మక్కువ !

— అబ్బూరి రామకృష్ణరావు

అరసికాయ
కవిత్వ నివేదనం
శిరసి మా లిఖ
మా లిఖ మా లిఖ



పుష్యం
జయ



Published by A. Chaya Devi, M. A.,
at A-10-431, Himayatnagar, Hyderabad.
Printed at Moses & Co., Secunderabad.

# స్వవిషయ సూచిక

వరద

సందేహిస్తున్నారు నవకవిత్వాన్ని
సాహిత్యంలో మన బంధుత్వాన్ని
ఎందుకోసం మన ధ్యానముద్ర ?
ఎందుకీ చైతన్యవంతమైన నిద్ర ?
ఏమంటావు ఆరుద్ర ?

ఆరుద్ర

కల నిజపరచడం కాదు కవిత్వం
నిజాన్ని కలగనడమే దాని తత్వం
స్వప్నంలోని ఆదర్శవంతమైన స్వర్గం
సాధించినమీదట అదే సాక్షాత్తూ నరకదుర్గం
కలలు కన్నారు ఆదిమ రాజకీయపురుషులు
కలలు కన్నారా స్వార్థరహిత పురాణపురుషులు
చక్కటి కవిత్వంయొక్క పర్యవసానం
ఒక్కగా నొక్క భూతలస్వర్గం
జాగ్రదవస్థలోనే దుస్స్వప్నం
అందుకే అనుభవం నినదించడం కవిత్వం
భవాన్నీ భయాన్నీ వచించి చించడం కవిత్వం

వరద

అవును, నిజం నువ్వన్నమాట
అందుకే మనం అల్లుకొంటున్న పాట

కాసీ యీ లోకంతీరు చూడు
కవితకు కలం కాగితం మాత్రం తోడు
అంతకన్న అర్థంకాని జనం
అనర్థకాలను వెతుక్కుంటున్న మనం!
మనిషి వ్యథల గుండె చెరువు
మనషి కథల కలల కరువు
మంది మధ్యదారి తెగిన రథ్య
బొందితో స్వర్గం నిత్యం ఆరాధ్య!
నిచ్చెనలా నిలిపి కవిత్వాన్ని
చచ్చిన వారెందరీ తత్వాన్ని!

ఆరుద్ర

సమాజంలో కవిగూడా ఒకడే _
అయినా విరుద్ధమైనవాడు అతడే
సబ్జెక్టివ్ భావాన్ని
ఆబ్జెక్టివ్‌గా రాసినట్టే
ఆబ్జెక్టివ్ బాధల్ని
సబ్జెక్టివ్‌గా రచించవచ్చు;
పోగొట్టుకొన కూడదు వ్యక్తిత్వం
అయితే ఆధునికం అంతా అవ్యక్తం
వర్తమాన కవితయేమిటో తెలుసా వరదా?
అది భూత భవితవ్యాల మధ్య ట్రాన్స్‌పరెంట్ పరదా!

వరద

సామాన్యులకీ వర్తమానం
సాయుజ్య చింతనలో నిత్యావసానం
గతంలో బ్రతుకుతారు
స్వగతంతో చితుకుతారు

నలుగురితోపాటు నారాయణ
తొలినీతుల పారాయణ
దేహం వారికొక పెనుసందేహం
దేశం వారికి సంకుచిత సందేశం!

ఆరుద్ర

సందేహం లేని సంశోధన
సందేశం లేని సంవిధాన సాధన
కానేరదు కవిత్వం
దానికి సిద్ధించ దమరత్వం

వరద

సందేశం ఎవరినుంచెవరికి?
సందేహం దేనికి చివరికి?

ఆరుద్ర

సందేహం నిత్య నైమిత్తికాల గురించా?
సందేశం మామ్మూలు చిల్లర విషయాలమీదనా?
ఏది చిల్లర, యేది మామ్మూలు, యేది రొటీను?
క్షణక్షణం ఉత్పన్నమయ్యే సాదాసమస్యలు
పరిష్కర్తపనికి కవిత రాజీనామా చేస్తుందా?
అసలు ఆ ఉద్యోగం కవిత్వం చెయ్యాలా?
ఐఖాస్టయిన్ని ఐదోయెక్కం నేర్పమన్నట్లు
కవిత్వంతో జీవితం గొడ్లపాకలోని
కసువు ఊడ్పించాలా? కవిత గొరకచీపురా?
కవిత్వం రోజూ వాడని ట్రూత్‌బ్రష్!
యాంత్రిక నాగరికత కాంతివంతమైన చీకటిలాగ
జీవితాన్ని ఆవరించి వేళ్లాడుతున్నపుడు

శాస్త్రం, చరిత్ర, చర్చ, ఛందస్సుకి విడాకులిచ్చినపుడు
జాతి జీవనంలో తీరుబాటు తగ్గుతున్నపుడు
కవిత్వం తన పాత ఆఫీసునుండి నిష్క్రమిస్తుంది
వేదాల కాలంలో దాని దారి వేరు
మానవ నేత్రం చూసిన ప్రతి చిత్రాన్నీ
గానం చేసిన రోజులు కావు
ఆదిలో దైనిక సమస్యల్ని మంత్రం పరిష్కరించింది
నేడు భౌతిక సమస్యల్ని యంత్రం పరిష్కరిస్తున్నది
వ్యాపార ప్రకటనల మోసానికి కర పత్రాల గాత్రానికి
కవిత్వం సహాయ విద్రోహి కారాదు
కవిత్వం విజ్ఞాన కూపంలోని ఉదకమే కాని
బాల్చీకాదు, చేంతాడు అసలే కాదు
నూతన ఛందస్సుల యంత్ర పరికరాలతో
నూతిలోని నీరు తోడు కొనడమేలు
దప్పిక తప్పక తీర్చగలిగేది కవిత !
ఎప్పటికైనా మానవ పధికుడు చేరుకొనే
గొప్ప విశ్రాంతి మందిరం కవిత !
ఆధ్యాత్మిక ఆముష్మిక చింతనతో
సత్యం శివం సుందరం స్వరూపాల చూపించి
అనంత అంతిమ సందేశం వినిపించేది కవిత !
అయినా యాంత్రిక జనులది లక్ష్యపెట్టరు
వారి చెవుల చవులు పుట్టవు
వారు కవిత్వాన్ని అన్నం వండ మంటారు
ప్రమిదలోనూనెకమ్మంటారు
ఆకలికి తట్టు కోలేరు
చీకటికి భయపడతారు

వ ర ద

జీమూతం పరిధి
జీవితం పరమావధి
ఎరుపు దిగని సంజవేళ
ఏ సంకేతాల స్వరమేళ
భయపెడు తోంది వీళ్లని ?
ప్రార్థించ మంటున్నది దేవుళ్లని ?

ఆ ర ద్ర

మొదలెక్కడో తెలియని పరుగు
తుద బోధపడక గుండె కరుగు
ఏమీ చేత కాక వీళ్ల విలాపం
దారి మధ్య ఆరి పోతుంది వీళ్ల దీపం
అందుకే తోడు రమ్మని అభ్యర్థన
దేవుడికి నిరంతర ప్రార్థన !

వ ర ద

ఎలుగు లేని వాడికెలా కనిపిస్తుంది వెలుగు
పులుగు కాని వాడికెలా విహాయసదృక్పథం కలుగు ?
కవిత్వం విధ్వంసక కారణ విచ్ఛేదన
కవిత్వం నిత్య సౌందర్యారాధన !

ఆ ర ద్ర

ఏది సౌందర్యం ?
ఏది మాధుర్యం ?
విచిత్రమే సౌందర్యం
విచింతనమే మాధుర్యం
అని కొందరు !

మరి కొందరు
తలపులే సౌందర్యం
వలపులే మాధుర్యం
అను చుందురు
ఏది సౌందర్యం ?
ఏది మాధుర్యం ?

వరద

నిజం సౌందర్యం
నిజం మాధుర్యం

ఆరుద్ర

ఏది నిజమైనది ?
ఏమి రుజువైనది ?
కడలి నిజమైనదను కుంటాను
కదలిక రుజువైనదను కుంటాను
ఏది నిజమైనది ?
ఏమి రుజువైనది ?

వరద

కనిపించేది మట్టుకే కాదు నిజం
కనిపించనిది కూడా నిజం
రుజువు చెయ్యని నిజం
రోజూ చూస్తున్న మాట నిజం
నిజానికి రుజు వక్కర్లేదు
రుజూ కానిది కవిత్వానికి ఖనిజం !

ఆరుద్ర

అయితే కవిత్వం శ్రమా ?
లేక కుటీర పరిశ్రమా ?

వరద

శ్రమ లేనిదే మనోరమ సాక్షాత్కరించదు
శాశ్వతాన్ని ప్రస్తుతం ఆవిష్కరించదు
వినియోగంలేని పరిశ్రమ వ్యర్థం
విశాల హృదయానికి మొదటి మెట్టు స్వార్థం
కవిత స్వార్థం
కవిత రమణీయార్థం !

ఆరుద్ర

రాబర్టు గ్రేవ్సు చెప్పినట్టు
ముత్యాలు చేరుకుంటాయి నగల కొట్టు
పద్యాలు చదవబడతాయి ప్రజల చేత
వర్తకుని మనసులో పెట్టుకొని
శుక్తి మౌక్తికాలను ధరించదు
ప్రజను దృష్టిలో నిడుకొని కవి రచించదు
బేహారి తానె ముత్యముల సేకరించు
అటులె ప్రజకూడ కావ్యముల నాదరించు !

# డిలన్ థామస్

మరీ ముఖ్యంగా ఒక మాఘ మాసపు గాలి

మరీ ముఖ్యంగా ఒక మాఘ మాసపు గాలి
మంచు వేళ్లతో నా జుత్తును శిక్షించే టప్పుడు
పీత చేతుల సూర్యుడికి దొరికిపోయి నిప్పులమీద నడుస్తూ నేను
నేల మీద రచించగా ఒక పీత లాంటి నీడని
సముద్ర తీరం వార విహంగాల రొద వింటూ
చలి కాలపు కట్టెల్లో వింటూ మాల కాకి దగ్గులు
నా తొందర గుండె మాట్లాడుతూ వణకుతుంది
మాటల నెత్తురు కక్కుతుంది భాషని పూర్తిగా పిండుతుంది.

మరిన్ని మాటు మణిగి మాటల ప్రాకారంలో నేను
పరీక్షిస్తాను క్షితిజరేఖ మీద చెట్లలా నడుస్తూ
మాటల రూపం ధరించిన మందయానల నెందర్నో
చుక్కల సంజ్ఞలు చేసే చక్కని పిల్లల బారుల్ని చూస్తాను
కొన్ని నీ కోసం చెయ్యనిస్తాయి అచ్చుల సరుగుడు చెట్లని పార్కులో
కొన్ని మర్రి చెట్ల కూతల్ని కొన్నిటి వేళ్లలోంచి
ముళ్ల పట్టణాలు బయల్దేరి మోహన గానం చేస్తాయి
కొన్ని చెయ్యనిస్తాయి నీ కోసం మంచి నీళ్ల ఉపన్యాసాలు

గోతెం మొక్కల వెనకాతల ఊగాడే గడియారం
కాలం వాక్కు చెబుతుంది నరాల్లోని అర్థం
ఎగురుతుంది చక్రబాణంమీద ఊదుతుంది ఉదయాన్ని
కోడి గొంతుకలో పొడిచిన పొద్దు వేడెంతో కొలుస్తుంది
కొన్ని చెయ్యనిస్తాయి నీ కోసం మైదానాల సంకేతాలు

హెచ్చరించే పచ్చిక నేను నేర్చిన దంతా చెబుతుంది
పురుగు దొలిచిన శీతువుతో విరుచుకు పడుతుంది కంట్లో
కొన్ని చెప్పనిస్తాయి నీ కోసం మాలకాకి పాపాలు

మరీ ముఖ్యంగా ఒకానొక మాఘ మాసపు గాలి
(కొన్ని చెయ్యనిస్తాయి నీ కోసం శరత్కాలపు యజ్ఞాలు
సాలె పురుగు నాలుక వేల్పు కొండ గర్జన)
దుంపల పిడికిళ్లతో నేలను శిక్షించేటప్పుడు
కొన్ని నీ కోసం చెయ్యనిస్తాయి గుండెల్లేని మాటల్ని
నిండు కుంటుంది హృదయం రాసాయనిక రక్తంలో
వల్లెవేస్తూ వర్ణక్రమాలు వచ్చే తుపాన్ని పసికడుతుంది
సముద్ర తీరంవార కాటుక మాటల పిట్టల్ని వింటుంది.

అనుకృతి : శ్రీ శ్రీ

# బాల గంగాధర తిలక్

ఒక శ్రుతి

ఒక శ్రుతి
ఒక గతి
వినబడును దూరదూరముల,
దూరదూరముల
రేఖగా
పొలిమేరగా
కరిగి నిల్చిన నాలోన
ఒక శ్రుతి
ఒక గతి.

గిరిపుత్రి కడగంటి
మణిదీప్తి విరిసికొని
హిమశైల శిఖరమ్ము
కటకమ్ము నొరసికొని
నాలోన
లోలోన
గుండెలను చుట్టుకొని
బ్రతుకునే మలచుకొని
ఒక శ్రుతి
ఒక గతి.

ఆకసపు చలువరాల లోయ
దిగజారి దిగజారి

మెరుగు బంగరు తళతళల కెరటమ్ము
విరిగి పడినటుల
నాలోన
కెరలిసుడి తిరిగినటుల
ఒక శ్రుతి
ఒక గతి.

ఒక లేత నెత్తావిచరణమ్ము
మెత్తగా మెల్లగా
నాసుప్త సౌందర్య హృదయమ్ము
లో నడిచినటు
పరుగిడినటు ఝణంఝణల
తిరిగినటు
కుచ్చెళ్ల చీర చెరగులొరసికొని
బెరసికొని మెరసికొని
తలపు చివరల తిరిగినటు
పరుగిడినటు
ఒక శ్రుతి
ఒక గతి.

చెరగి
నేను పుట్టిన పురిటినొప్పుల
చీకటి చార
చెరగి
నేను నశించు చావు సంజెల
నెత్తుటి చార
చెరపికొని నీమధ్య నీమధ్యగల
దూరపు రేఖ.

తెలిసికొని నీమధ్య నామధ్య వంగిన
తారకల శాఖ
కదలగా నిశ్చలతలో
కదలగా కదలగా
కిన్నెరలు కొనగోట
వెండి చుక్కలు మీట
రంగురంగుల పవడంపు
దారాల భావాల నల్లుకొను
సౌందర్యమై
శాంతియై
సాయుజ్యమై
ఒక గతి
ఒక శ్రుతి.

రమ్యం జుగుప్సితముదార మధాపినీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతంచవస్తు
యద్వాప్యవస్తు కవిభావక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావముపైతి లోకే.

# అబ్బూరి రామకృష్ణరావు

## ఏ త్రోవల పయనించెదవు

ఏ త్రోవల పయనించెదవే నిశీథ శయ్యలపై
శయనించెద ? వేయెల దోటలలోని యావాసము ?
ఏ కరాళ పన్నగీ సమూహము నీసావాసము ?
తరుశాఖా లంబితమై తూగు వెలుగు టుయ్యేలపై
చంచలించు నీ రూపము, పరిమళములు కదంబించు
నీ విలోల మంద హాస సౌదామని యొక్కసారి
నాయంతస్సీమ లందు వెల్లువయై వరదవారి
ఏ జన్మాంతర సౌహృదమో నాలో మేళవించు.
మఱి వేతాక వేళ ముక్తకేశి పై దిశా విశాల
వీధీ వేదికలదరగ విక్రమించి విలపింతువు
విషమ వేష ధారిణి పై జ్వాలా మాలికలు వ్రేల
ఘనఘోంతరాళమ్ములు కొందలింప విహరింతువు
నా జీవన పాతాళము పెల్లు వెల్లి విరిసె నేమొ ?
నా కథనీ జలదమాల జడివానలు కురిసె నేమొ ?

# కుందుర్తి

## రెండు లోకాలు

౧

ఇక్కడ ఒకలోకం —
        చరమ సంధ్యకు విడాకులిచ్చి, రవిచేసిన చీకటి తప్పు
        చరిత్ర నిర్మించిన ధరిత్రి కమలవనానికి ముప్పు

ఇక్కడి మనుషులు
హేతువును జీర్ణించుకోలేని మనసులు
చిలకల మాటలు బిగిస్తారు
పంజరాల అధికోత్పత్తికి ప్రణాళికలు వేస్తారు
మంచినీటి బావుల్లో మందుకలిపి తాగిస్తారు.

ఇక్కడి వాళ్లు
సర్కస్ డేరాల్లో ఆడే పులులు
చెరువులో చేపల్ని పట్టుకోలేని వలలు
చక్ర వడ్డీల పరిధుల్లో అసువులు బాసిన అసల్లు
కన్నీళ్లు కార్చే మొసళ్లు.

ఎటుపోయినా అడవిమృగాలు తిరిగే జాడలు
మిణుగురులను నిరంతరం వేటాడే చీకటి
అజ్ఞాత వాసుల ఆచూకీ యిచ్చే కొండ శిఖరాలు
అప్పుడప్పుడు మరతుపాకులు కాల్చే యోగులు
ఉపోషాలు చేసే భోగులు, వీధుల్లో పెంటపోగులు!

ఇక్కడి బ్రతుకులు అక్షరాన్ని పూర్తిగా పలకలేని ద్రుతాలు
సంఘంబాగుకు సత్యనారాయణ వ్రతాలు,
మతాలు కల్పించిన నిమ్నోన్నతాలు

ఇక్కడ లాభాలు పెరిగినకొద్దీ కంపెనీలు దివాలాతీస్తై
జీతాలు గొంతు పట్టుకుని నూతుల్లోకి తొంగిచూస్తై
పరిశ్రమల పావుకోళ్లక్రింద ముడిసరుకులు నలుగుతై
ప్రతినిత్యం ధరవరులు ప్రజలమీద అలుగుతై
నదులూ సముద్రాలు పొంగి యితరుల పొలాలు ఆక్రమించుకుంటై.

ఇక్కడ మిన్నుకూ మన్నుకూ మధ్య మేఘం గోడలు కట్టింది
వ్యక్తికీ ముక్తికీ మధ్య హరివిల్లు గిరిగీసి పెట్టింది.
ఎక్కడ చూసినా ఓడిన హోదాలు - వాడిపోయిన నినాదాలు
ఏనుగును వర్ణించిన జనుషాంధుల వాదాలు.

ఒకపక్క యెన్నిఖండాలు గెలిచినా తీరని రణదాహం
ఎన్ని గండాలువచ్చినా ఆరని పదవీ వ్యామోహం
ఎదురుగా గాలితిని ముడుచుకు పడుకున్న పాముల ఫణాలు
మానని మానభంగాల వ్రణాలు.
ఇక్కడ అణువు బాంబులు - రాచరికం వీపుమీద పుండ్లు
శాంతికి - చరిత్ర తీసుకునేవి విశ్రాంతికి - గండ్లు.

ఇక్కడ తిండిలేని వాళ్ళకు కందమూలాల కోసం
ధీరులు అడివికి పోతారు
యింటివద్ద బొడ్రాయిచుట్టూ
దిగంబరులు ఆటవిక నాట్యం చేస్తారు.

ఇక్కడ అందరికీ స్వేచ్ఛ !
నీతిని యింట్లో కట్టేసి అధికార్లు ఆఫీసుకు రావచ్చు
అభిమానాన్ని నెట్టేసి నాయకులు కారుల్లో ఊరేగొచ్చు

ఖర్చులు దుబారాను లేపకొచ్చి ఖజానాలో కాపురం చెయ్యొచ్చు
దినపత్రికల రైళ్లమీద ఊరూరికీ పుకార్లు షికారు చెయ్యొచ్చు

ఇక్కడికి అందరూ రావచ్చు - యిది పాతాళానికి మచ్చు
వెల్తురు చాలక చెడిపోయిన ఫొటో - వెనుకటి తరాలకు డిటో

౨

అక్కడ ఒకలోకం —
వికసించిన వేకువలో పూసిన ఉదయం పువ్వు
చరిత్ర పెదవుల మీద తొలిసారిగా విరిసిన నవ్వు

అక్కడి మనుషులు
చేసిన యోగాభ్యాసం సిద్ధించిన మనసులు
తెల్లని పావురాళ్లను పెంచుతారు
మెడలో చీటీలు కట్టి మింటి మీదికి వదుల్తారు
పంజరాల ఉత్పత్తి నిషేధిస్తారు.

అక్కడి వాళ్లు —
సంకెళ్లు లేని కాళ్లు
నిర్బంధ ప్రాసనియమాల్తో నిమిత్తంలేని కవిత్వాలు
ధనగిరుల గర్వాన్ని అణచిన మునిశిఖామణులు
కిరాతకుడి బాణం పలికించిన ఉత్తమ శ్లోకాలు
చదువుకుని ఆశ్రమాల్లో నివసించే అడివి మృగాలు
యిరులుమింగి వెన్నెలంతగా పెరిగిన మిణుగురులు
వాన మబ్బుల్ని ఆకర్షించుకునే కొండశిఖరాలు.

అక్కడి పరిశ్రమలు లాభాలకు విడాకులిచ్చి
ప్రజలను పెండ్లి చేసుకుంటై

ధరలన్నీ జలాంతర్గాముల్లో ఉద్యోగాలకు కుదురుతై
నెలనెలావచ్చే ఒరుమానాలు కొలమానాలకు అందవు
అక్కడ మేఖాలు కట్టిన తేమిగోడలు విరిగి భువిమీద పడతై
వాటి వానల మేనాలమీద, సమృద్ధి గిరలు దాటి పారుతుంది.

అది ఒక వింత నిర్బంధాల సంత —
ఆదర్శవంతమైన అభిప్రాయాల విక్రయాలు రద్దుచేస్తారు
గ్రామాల్లో వీధులన్నీ గుడిశె గుర్తుల్ని నిషేధిస్తై
శాస్త్రంచేసే నిరంకుశాజ్ఞలకు లోబడి
అందరికీ యెండ అన్నం వండి పెడుతుంది
సాగరం వెనక్కిమళ్లి భూమిని విశాలం చేస్తుంది
నదులు అభిసారికలై పంటపొలాల్ని వెదుక్కుంటై
చెప్పినట్లు వినే మంచి పిల్లవాడిలా
అణువు రైళ్లు నడుపుతుంది - గనిగర్భం తొలుస్తుంది.

ఆరుఋతువులు మొక్కలకు దాస్యంచేస్తై
మనిషినాటిన శ్రమచెట్టు - సరిగా, తప్పని సరిగా
విరివిగా ఫలిస్తుంది.
చీకటిచేత బలవంతాన ఉద్యోగానికి రాజీనామా పెట్టిస్తారు
వెలుక్కు ప్రతియింటిలోనూ వెట్టిచాకిరి శాసిస్తారు
అక్కడి మానవుల తలంపులు తారలను వెక్కిరిస్తై
రాకెట్లవేగాన్ని, అభివృద్ధి యెద్దుబండితో పోలుస్తుంది.

అక్కడికి అందరూ పోవచ్చు - భూదేవి ధరించిన బంగారపు జడకుచ్చు
వెన్నెల తీగల రాగాలు 'మాటో' చీకటికి వీటో :

# ఎమిలీ డికిన్సన్

ఏనుమృత్యువు కొరకాగ లేకపోయితిని
గాన నాతడే కనికరించి నాకొరకాగినాడు
అతని రథమ్మున మాయిరువురికి మించి
అమరత్వమ్మునకె కలదు స్థలమ్ము

అతి మెల్లగా మేము సాగినాము
అతడు తొందర పాటు నెరుంగడు
వాని సాధుత్వ మరసి నేను
వర్జించితిని శ్రమను శ్రాంతిని కూడ

గురుకుల బాలకుల ఖేలన మరసితిమి
అరసితిమి గోదాయందు మల్లరణము
కంకుల కనుల పొలాల నధిగమించితిమి
గమించినార మస్తంగమిత దినమణిని

ఇలదేవి నొసటి బొప్పివలె కన్పట్టు
యింటి ముంగిట నాగితి మొకింత తడవు
అగుపడు నాయింటి కప్పు అంతంత మాత్రము
ఐన కందకము మాత్ర మొకండు మంటి దిబ్బ!

ఆనాటి నుండి గడచిన వెన్నొ శతాబ్దులు
కాని తోచె ప్రతి యొకటి దినమ్ము కన్నను హీనమ్ము
అనంత కాలాభి ముఖమ్ముగా మారధ
హయమ్ములు గమించునని గ్రహించితిని మొదల!

అనుకృతి : ఆరుద్ర

# రామ ధారీ సింహ

మ హా భి యా న ం

జ్వల ద్దివా శిఖ వోలె ఎగసి నీవలము కొంటి వీ జీవితనభమున
కవితా ! శాంతి లేక తృషితుడనై తిరుగు చుంటి నేనీ త్రిభువనమున
దాహము హృదిని, కంఠమున కీలలు, ముందున్నది ప్రభువరుని మరుస్థలి
రాల్చదు కణమైనా తృషితాధ్వగ గళమున మృషావీచి దృశ్యావలి
పొగలు, సెగలు ఇంటింటా వింటిని జగమంతా నిప్పంటు కొన్నదని
'దాహము' 'దాహమ'ందురని మనుజులు, ఎలుగెలుగున తృషభగ్గుమన్నదని
నీలాంబర రసమింకి పోయె నొక గ్రుక్కద్రావి జగతీ విషసారము
పైపై నెగిరిపోవు ఆవిరిగా సర్గ తాపమున వర్షాసారము
మాన వాశ్రుయుక్తార్ణవ నీరము క్షారమైన ప్రతి నిమసము ఫెళ్లున
కొండ గుండె చీల్చుకొని యురికినది సెల జల జల మని నామది చల్లన
మహాశ్చర్యమది త్రావ సాగినది నన్నే చల ద్వీచి కాధరముల
'బండ గుండె చీల్చుకొని వెడలితిని, దప్పి గొంటి నన్నది సుస్వరముల
విధివైషమ్యమహో, నిర్భాగ్యుడ, ధన్యుల నెటుల బోలు దాకవులను
నష్టా భావుల, ద్రష్టా నావృత తావక పావన జీవచ్ఛవులను.
దాహ దగ్ధ పృథివికి దూరంగా గగన కుసుమ సురభిళవన సీమల
జలదాలసకేశుల పచరించెదు నీవు వారి ప్రేమల పసిగోముల.
సంతత విల సత్కుసుమ భూషలు, కులిశఘోష కచ్చట తావెక్కడ ?
పవల్లా పూవుల తావులలో ఆట తప్ప పాటలు లేవక్కడ.
కృతులు వారు, నిన్ననుగమింతురుజ్జ్వల కల్పనా కమల తల్పమునకు
చరణతలోద్గత మృద్గీతులరుతి చెరుపదు వారి కలలు స్వల్పమునకు
సుందరి ! నాకూ ఉందొక కోరిక లావణ్యానికి శిరమొగ్గాలని

మాధవ చరణానుగమలయుడనై సుమన స్నేహాపణము నెగ్గాలని
ఒక కోరిక, మాలినీ తీరమున తరువుల డాగిన తస్కరేక్షణము
ముని బాలల యౌవన భారానత ప్రతను కటి ధృతఘటమ్ముదుగమనము
ప్రథమ స్పర్శాకుల పులకారుణ తరుణీ వదన మసృణ సుమకలనా
భాస్వర భూస్వర్లోక సదృశ మాలతా కుంజమున తొంగిచూతునా ?
జనకానన రోదన మానని కడ స్వప్న నీడములు నిర్మించేనా ?
విశ్వార్త ధ్వని వీనుల వేచని ఆశ్రయముల తలదాచుకొనేనా ?
ఊర్మిదోళికల తూగిన కిరణం సంజమసకలో మాసినటులనే
మాయమౌదునా అటుల పాటల ప్రొద్దుబుచ్చితినే స్వప్నతటులనే ?
కాని శూన్యమున నీడము పొసగదు, పన్నినాను ఎన్నెన్నో యుక్తులు
సమసిపోవు కల్పనలు నక్షుమనే, శిల్పమొదిగినా పొసగవు రక్తులు
ఉండియుండినే పతనమందెదను భూక్రందనమున ఆహతఖగమై
ఒక్కవిసురుతో తుడుచుకపోవును స్వప్నరాజ్యమద్రోర్మిసహగమై
కుపిత దేవతల శాపశిఖలు ఖరతటి దానుతై నర్తించెడు శిరమున
మూఢభావనలు భస్మపటలమై చీత్కరించు తిరుగబడెడి యురమున
పాత్రితచ్యాస్పృక్మ్రేఘ వలయమున అస్తప్రాయ తరణి ముఖదైన్యము
తిలకించిన హృదికలగి కరగి జలజల రాలును కనులంట అనన్యము.
విషమ మరణ రాగిణులు రచితమగు నేడు వికట భవహింసోత్సవమున
అణగిన మానవ శాపతాపములు పునఃప్రకటమైనవి ప్రాభవమున
ఖడ్గహస్తయై నిష్ఠుర సంస్కృతి శుభ్రపటము శోణావిల మొనరుచు
సింహద్వారముకడ దలితాస్థుల ఉల్కలతో దీపావళి పొనరుచు
రాక్షస నాగరికత విహరించును 'శాంతి' 'శాంతి' యనుచూ భూతలమున
అశుగుదెవ్వరైనా తనకోరలు తడుపుచున్నదేల నది గరళమున ?
చర్మం ఒలచి కుట్టుతున్నా ఈ 'శాంతి' మేము కదలనే కూడదో
ఒక్క కెలనగొంతుక కోస్తూనే 'శాంతి' పెదవి మెదలనే కూడదో
'శాంతి' క్షుధార్తుల నోళుల ముద్దల గొనిపోతున్నవి చీదర కుక్కలు
'శాంతి' వారు కాలిడినవెంటనే ఇల్లువదలి పోకుంటే చిక్కులు

కటికి తుపాకిగుండ్లచే వ్రాలున నీగోర్రిలకు సంస్కృతి పాఠాలా?
'శాంతి' ఇదేనా మండేగుండెల సెగలచెరకు అధరకవాటాలా?
దనుజుల రక్తశోషకులకడనా శాంతిభాషణములహో కుమారీ!
పాపానికి ప్రతికృతి యొనరించని శాంతి భ్రాంతికాదా సుకుమారీ!
మండుటెండలైనా, చలియైనా మనరైతులకు శాంతిలేదెన్నడు
విడదుతోడు ఎద్దులతో బ్రతుకుగల చీకటిలోన కాంతిలేదెన్నడు
నాలుక నోట, శక్తి బాహువులను, సుఖముజీవితములో కనుపించదు
వ్యంజనములా? గంజి గ్రుక్కెడుకూడా కాలే కడుపులకు లభించదు
స్వప్న వ్యోమామానికి సుదూర మీ శోకాకుల ధరణీతలి బాలా!
పంట్రకల్లములలో చెలరేగునిచట గగ్గోలు, గిజగిజలు బాలా!
వృషభానుజహాలధరులువీరు, మరి వత్సరమెల్ల ఎటుల గడుపుదురో?
విప్పరు నోరు, చెమర్చవు కన్నులు, అశ్రులుస్రావి, బాధ గుడిచెదరో?
కాని పాప మా పాపకేమిగతి? అశ్రులు స్రావనేర్వలేదింకను
ఎండిన రొమ్ములు చప్పరించి, రోదించ నిదుర జోగొట్టును కుంకను.
వివశ మాతృ దృక్తారల ముందే ప్రాణమెగిరి పోవును గిలగిలమని
వజ్ర వక్షమది దీర్ణమైన తన రక్తము స్రావించెడిదే సరగున
ప్రతి సమాధిలో ఒక్కొక్క బాలుని క్షుధి తాస్థికల ప్రచండరోదనము
'పాలు' 'పాలు' అడుగడుగున నశిలో కరుణారవముల విఫలయాచనము
'పాలు' 'పాలు' పాపా! దేవళములలో నున్నవి బధిర ప్రస్తరములు
'పాలు' 'పాలు' ఈ పిల్లల దేవుడు ఎక్కడున్నదీ చెప్పవు తారలు
'పాలు' 'పాలు' పరిసుప్త భువనములు, ఇప్పుడు దొరకగలవు పాలెక్కడ.
'పాలు' 'పాలు' ఓ దేవతలారా! మీరే రాల్చరు నాలుగు చుక్కలు!
'పాలు' 'పాలు' గంగా! నీవైనా నీరు పాలుగా మార్చగదమ్మా!
'పాలు' 'పాలు' ఈ క్షుధితశవాలను ఓ దార్చే వారలు ఎవరమ్మా?
'పాలు' 'పాలు' మళ్లీ పాలేనా! పాలు మరువలే వాక్షణమైనా
'పాలు' 'పాలు' చచ్చియు పాల్గుడువక నిదుర పోవలే వాక్షణమైనా?
తమ కుక్కలకు పాలతో స్నానము చేయించే వారునూ ఇక్కడే,

పాల కొరకు గోరీల్లో కెవ్వున ఏడ్చే పిల్లలు కూడా ఇక్కడే
ఈ అమాయకపు చిట్టి దేవతల శాపమువలె నిలచినది హైమగిరి
సృష్టి మూలాలే కదల నున్నదా, ఏంచూస్తోందీ నిమిషము హైమగిరి !
'పాలు' 'పాలు' గోరీల కంఠ మది, నేడు పాలు తేవలసిందేనా ?
మగ్ధదధుల నదములు ప్రవహించే గమ్యానికి పోవలసిందేనా ?
జయమో లోక సాక్షిణీ ధరణీ ! జయము నీకు సువిశాలాంబరమా !
జయము నగాధిప ! జయము వింధ్యగిరి ! జయమో హిందూ రత్నాకరమా !
తప్పు కోండి మేఘాల మార్గమున స్వర్గం దోచేందుకు వస్తున్నాం
'పాలు' 'పాలు' పాపా ! ఇదిగో నీ కోసం పాలు వెదకి తెస్తున్నాం.

అనుకృతి : బైరాగి

"లోక వృత్తమంతా కావ్యానికి వస్తువే. ఏ వస్తువు
లోనూ స్వతస్సిద్ధంగా కావ్యత్వం లేదు. కవి భావ
నారోపణం వల్ల కావ్యత్వం వస్తువులో నిష్ఠమౌతుంది.
కాబట్టి వస్తుతః ఉత్తమమనీ అధమమనీ, ఆరాధ్యమనీ
త్యాజ్యమనీ నిర్ధారించుట సాహసం."

# బాల గంగాధర తిలక్

వాన కురిసిన రాత్రి

చినుకు చినుకుగ వాన కురిసినటు
          నిశికి
సన్న చీకటి దోమ తెర కట్టినటు
చలిచలిగ గాలి
చెట్ల ఆకుల దూరి కప్ప బెకబెకల తేలి
చూరులో నిదుర తూలి
గుండె కొసలను మెల్లగా జారినటు
కప్పుకొని దళసరి దుప్పటిలో
వెచ్చ వెచ్చని మనసులో పొరలి వచ్చు
నిదురలో చినుకు రాలినటు
          కలలు జారు సవ్వడి.

ఆరోజు సాయంత్ర మమ్మిన మల్లెపూలు
ఆమె సిగ దాల్చి నవ్వినటు
నాయొడలు తగిలినటు
కాలమే కరగినటు
ఆకసము వణకి నటు
ఏదో అనిపించి సగము తెరచిన కనుల
కెదురుగా
గదిలోన దీపశిఖ కదలు నీడలనడుమ
మదిలోన తొలికోర్కె మసక నిద్దుర నడుమ
చినుకు చినుకుగ వాన కురిసినటు
          నిశికి

సన్న చీకటి దోమ తెర కట్టినటు
గదిలోన దీప శిఖ కదలు నీడల నడుమ
ఎర్రనై, ఏ కాంత సరస్సున విరిసిన
ఎర్రకలువ యటు
తీరని కోరికటు
తెరచిన విరహిణి నయనమటు
కదలు నీడల మధ్య గదిలోన దీప శిఖ
కదలు కలల బంగరు వలల
రంగురంగుల బొరుసులాడించు చేప,
చేపలకు తగిలి మెరసిన నీరు,
నీరు విడి చినుకు చినుకుగ వాన కురిసి నటు
నిద్రవిడి మినుకు మినుకుగ స్వప్నమెరసినటు.

# ఏల్చూరి సుబ్రహ్మణ్యం

ఆ హ్వా తి

పవనంలో, పయోధిలో, పర్జన్యుని గర్జనలో
స్పందించిన చేతనతా!
జడత చెరను విడిపించిన సరితా!
మూగవడిన హిమకంఠం
ఛేదించుక దిగివచ్చిన జ్ఞానగంగ!
జలనిధిలో బడబాగ్నుల,
భూచరాల సృష్టించిన సంజీవీ!
ఈ అగ్నితప్త భూగోళం శమియించను
ఈ తీరని దాహార్తుల పరిహరించ
ఉదయించిన క్షీరాంబుధి!
ఈ ధేనువు కన్నులలో
తళుకొత్తిన పృథుశక్తీ!
దానవతను భంగించను
ప్రభవించిన కౌముది!
ఎపుడు సృష్టించావు మనిషిని?

ఎపుడు విప్పిన చటుల నేత్రం
సహస్రాక్షికి, కర్మ సాక్షికి
తెన్నుచూపే తేరు తెచ్చెను?

పుట్టబట్టీ, గుట్టబట్టీ,
కొండ చుట్టీ, కోన చుటీ

తిరిగివచ్చు తిన్నని
హృత్ఫలం పగిలె నెట్లు ?

రాతిలోని మంటల—
మంటలె కరదీపికగా
మార్చుకొన్న మనషు లెట్లు నడచిరి ఈ భూతలి ?

దివిజులతో పోరాడిన
బలయుతుడా ప్రామేథియస్
కన్నులలో జ్వలియించిన చటులదీప్తి,
లోకానికి నివాళిగా,
వడిగా, వెలుగుల జడిగా వచ్చిన దెట్టుల ?

వల్మీకమున తమసు
విరిచినది రణధనువు
అక్షయమ్మౌ శక్తి, అద్వితీయపు దీప్తి !
రాతికే కన్నులను, రాతికే పలుకులను
తీర్చినది, నేర్పినది ;
హలముతో భూతలికి అన్నమిడినది శక్తి
కలముతో భూతలికి కన్నులిచ్చిన శక్తి
ఉదయ సంధ్యా శిఖరి సాగుపోరాటాన
పార్థసారధి రథము నడిపించినది చూడు!

అడవిలో హరిణాల గతులలో
పెరుగు మందారంపు కన్నె చెరవిడిపించు
కాళిదాసుని గీతి మిన్నేటిలా పొంగి
పొరలినది ఈ రాత్రి, నిండు వెన్నెల రాత్రి!

సరిహద్దులన్నిటను చుట్టుకొచ్చే
మనిషి....
ఆగమించెను నేడు అవనికీనాడు!
తీరముల దాటేటి పెద్ద కన్నులు విప్పి
నడిపించె తన నావ,
క్రమియించె తీరాల
పెనుగాలి తాకిడుల లెక్కచేయని మనిషి!
బోధి వృక్షచ్ఛాయ చిగురించి ఒక ఆకు
శాంతిగా కాంతిగా దిగివచ్చె నీనాడు,
అవనీతలమ్ముపై వ్యధలన్ని త్రెంచుకొని
విప్పినవి రెక్కలను,
స్వప్న నయనాలన్ని చించుకొనె తెరలన్ని
ఈ నాడె మన బరువు దించుకొన్నది చూడు!
నసిలేని ఈ బ్రతుకు సార్థకమ్మొనరించు
అసిలేని సేనలను నడిపినది ఆశక్తి
బంది ఖానాలోని ప్రభువు రామునిచూచి
పొంగినది ఈ సరిత్తు తెగిపోయె సంకెలలు
ఆరామ రామునికి అవధు లెక్కడ గలవు?

పొంగించు నీశక్తి
—మొగ్గ విచ్చిన వేళ
— నావ కదలిన వేళ
—చుక్క పొడిచిన వేళ
—తలుపు తెరచినవేళ
—కాలు కదిపిన వేళ
—పచ్చి విరిగిన వేళ
కేదార తీరాల ఊహ పండెడి వేళ
దూరాన క్షేత్రాలు తొంగి చూచెడి వేళ

గంగా తరంగాల కెరటలు జీరల లోని
పసిడి దారులలోని, భావి పదముల జాడ
పొంగించు నీ శక్తి
తరలినది ఈ రథము!

పంట చేలకు వీపు నీరు కట్టాలింక
వంతలను దించుకొని పరుగెత్తు మీదారి
పిలుస్తోంది మానవుడా.
పరిస్తున్న సరితగీతి,
పిలుస్తోంది మానవుడా
ఆగని ఆచక్ర నేమి!

కలల నిజం నీకోసం
దారులన్ని సరిచేస్తున్నది
హర్షాగమ నవ వర్షాగమ వేళలలో
జాగదేమి సరిత నిన్ను పిలుస్తోంది
—విను, స్వాతంత్ర్యపు శంఖధ్వానం
జాగృతై వాళ్లంతా కన్నులుగా,
మిన్నులుగా కాపాడే కంచుకోట
రా ఇక మనిషీ!
ఎగరేయను ఈ జయపతాక.
ఉరికంబం ఎక్కిన మనిషి!
అంధకారవైరీ! కాలసర్పధారీ!
అనంత మీ యానం
ఇకరా - కదిలే ఈ రథాన్ని
కత్తి అంచుమీదినుంచి, నెత్తురు బొట్టుమీదనుంచి
మెరుపు తీగమీదనుంచి ఎక్కవచ్చు,
బరువులన్ని దించి ఎగురవచ్చు

బంధుత్వాల తెంచి మనుషులతో తిరగవచ్చు.
సరిత్పతీ ! - ఇక రావెందుకు మనిషీ
స్వాతంత్ర్యం మనకోసం విరిచింది రణధనుస్సు.

రంగులోని రంగులాగు, న్యూటన్ చూపులలా
ఈన్‌స్టిన్ ఎదలోతులలా
పొర్లుతు రావెందుకు ? పనిలో పని ఉన్నది
పని నిన్నే పరిస్తోంది.
సామాన్యుని శకానికిక సంకేతంగా మన యాత్రలో
దిగుళ్లన్ని దించేయను
వడివడిగా, పవనంలా, వెలుతురులా
గోదావరి, తుంగభద్ర, కృష్ణవేణి
పెన్నానది చేతులితో త్రోసుకుంటు
రావాలిక !
రావాలిక - ముందున్నది మనకని చరిత్ర
రావాలిక ! - ముందున్నది మనకని ధరిత్రి.

మనకేమిటి శాసనాలు, బ్రతుకంతా రాజనాలు
సరిత వెనుక చూడబోదు, కాలం ఇక తిరోగమించదు
రావాలిక రావాలిక——
అసామాన్య లందరి అడుగుల
సామాన్యులు నడచిన పుంతల
వంతల తెగత్రోసుకుంటు రావాలనిపించు నీవు !
అన్నులతో పన్నులతో
స్వేచ్ఛలేక కుళ్లిన జీవితాల కట్టుచాళ్ల
తొలకరిగా రావెందుకు మనిషీ !

పరిస్తోంది రసవతి నిన్నే ప్రగతి
వాడవాడ అదేచూడు అలజడితో జన సందోహం

నీకే ఉన్నది స్థానం, నీవే ఎక్కాలి రథం
నీవే చూపాలి పథం, కానీ కాని పనొక్కటి
పోనీ ఈ మరరోజుల మరులన్నిటి.
పురివీడే పోగులలా తెగిపోయే క్షణాలలో
వెతకవద్దు శీర్షికలను—
శూన్యంలా చుట్టుకరా పరిష్కార పాథోనిధి!
సరిత నిన్ను వరిస్తోంది,
నెత్తురు మలచినశక్తి, పరిధిలేని చక్రగతీ!
పవనంలో, పయోధిలో, పర్జన్యుని గర్జనలో!
స్పందించిన చేతనతా!!

"కావ్యము, శిల్పము, నీతి శాస్త్రము గాదు. ధర్మశాస్త్రము గాదు. శిల్పము యొక్క యుత్కర్ష నికర్షముల నేర్పరుపవలయునన్న దాని రచనా సంవిధానములం బట్టి నిరూపింప నగునే కాని, "భగవద్గీతలయంత పారిశుద్ధ్య మిందులో లేదు. రామానుజ భాష్యము వలె ముక్తిదాయకము కాదు" అని వాపోవుట నిర్నిమిత్త ప్రలాపము."

—కట్టమంచి రామలింగారెడ్డి

# బాల గంగాధర తిలక్

గొంగళీ పురుగులు.

బల్లపరపుగా పరచుకున్న జీవితం మీదనుంచి
భార్యామణి తాపీగా నడచివచ్చి అందిగదా
'పంచదార లేదు
పాలడబ్బా లేదు
బొగ్గు ల్లేవు — రాత్రికి
రగ్గు ల్లేవు.

రోజూ పాడే పాత పాటకి
రోజూ ఏడ్చే పాత చావుకి
విలువలేక, వినికూడా కదలకుండా గొంగళీ పురుగు
సగంసగం తిన్న కలల్ని నెమరేస్తూ నిద్రపోయింది.

రోజూ ఆవకాయ తిన్నట్టు
రొటీన్ అలవాటయిన
బల్లపరపు జీవితం కింద కాషన్ గాదాచిన
కోర్కెల సీక్రెట్ బాక్సు లోంచి తీసి
ఉద్రేకాల్ని, సెక్సుని, శృంగారాన్ని
క్రైమ్‌ని, షాక్‌ని, లాటరీ కాగితాల్ని
చాటుకుండా చూసుకుని నవ్వుకుని మీసంమెలేసుకుని
మాట్లాడకుండా జెంటిల్మాన్‌లా మత్తుగాపడుకుంది
గొంగళీ పురుగు

బస్సుస్టాప్ దగ్గర పరాయి ఆడది తనకేసి చూసిందని
మెరీనా కేంటీన్ యివతల నుంచుంటే మినపట్టు వాసన
ఘాటుగా వేసిందని
అసలు అప్పుడే కాంగ్రెసులో చేరివుంటే ఈపాటికి మినిస్టర్ని
అయిపోయివుండే వాడినని
పెళ్లాం దగ్గర చెప్పాలని సరదాపడి
'హయ్యో రామ నీబతుక్కి' అన్నట్టు మూతివిరిచే
అర్ధాంగి ఆకారం తల్చుకుని
ముడుచుకు పోయిన గొంగళీ పురుగు
తన్ని తనే తీసుకుని గోడ అవతలికి
తన్ని తనే గిరవా టేసుకుంది.

భూకంపం వచ్చిందన్నా
మరో యుద్ధం రేగిందన్నా
తన భార్య కవలల్ని కన్న దన్నా
కంగారు పడక కోటు తొడుక్కుని
కోటీశ్వరరావు ఆఫీసుకెళతాడు. వస్తాడు.

రాత్రి రెండో ఆట సినిమా చూసి
రత్తమ్మ యింటిముందాగిన రిక్షాలోంచి
దిగిన జరీకండువా పెద్దపులి జేబులోంచి పడిన
పర్సుని తీసి జాగ్రత్త పెట్టి
అక్కడే వెయిట్ చేసి
తిరిగి ధోవతిని సరిజేసుకుంటూ తూలుతూ వచ్చే
పెద్దపులి చేతికియిచ్చి
'థాంక్యూ' అనే పదాన్ని సంపాదించుకుని సంతోషించుకుని
వీపుమీద మోసుకుని వెళిపోతాడు వీరేశ్వరావు.

ఆఫీసరు వస్తే సాల్యూట్ చేస్తుంది కుడిచెయ్యి
ఆకలేస్తే గబగబా రాస్తుంది కుడిచెయ్యి
జేబులోంచి సెకండ్ హాండ్ సిగరెట్టు ముక్కల్ని
తీస్తుంది కుడిచెయ్యి
అయితే యింక ఎడంచెయ్యి ఉపయోగ మేమిటంటూ
నవ్వుకుంటూ ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఆనుకుని షాక్ తగిలి
నిరుపయోగంగా చచ్చిపోతాడు వీరేశ్వర్రావు

బ్లాక్ మార్కెటులో బియ్యం, బ్రాకెట్ల ఓపెనింగులు క్లోజింగులు
థియేటర్లో కొత్తసినిమా, కాఫీహోటలు రేడియోలో లతా
రోడ్డుమీద ఖరీదైన కార్లు, ఎన్నికల్లో నెగ్గినవాడి ఊరేగింపు
కేకలు కోకలు మూకలు ముసిరిన బజారు రోడ్డమ్మట
వీనులుండి వినక, కళ్లుండి చూడక నిటార్గా నేరుగా
యోగీశ్వరుడిలా నడుస్తాడు జోగీశ్వర్రావు.

చిన్నప్పటి ఆదర్శాలు అహంకారాలు నశించి
గోడమీద గ్రూఫ్ ఫొటోలు, బియే డిగ్రీలు కృశించి
నిత్యనైమిత్తిక మృద్భిత్తికల గుళ్లుకట్టి
సంఘ గౌరవ భైరవ దైవతముల్ని ప్రతిష్ఠించి
రసహీనమైన తమ జీవితాల్ని నివాళించి

నీడల మాటున పీడకలల చాటున నీరసంగా ఉంటుని
చనిపోయిన కోర్కెల్ని పాతిపెట్టిన శ్మశానాల చాటుకుని
అలవాట్ల ఆచారాల రైలు పట్టాలమీదనే దొర్లుకునిదొర్లుకుని
చిన్నప్పుడు తెలియక చేసినతప్పుకు రోగాలు మిగుల్చుకుని
యౌవనంలోనే వృద్ధాప్యాన్ని తగుల్చుకుని
భయాల చాటున, ఏడుపుడొంకల మాటున

నిస్తబ్ధపు నిస్సారపు పాడిళ్లగోడల మాటున
గుమాస్తాలు టీచర్లు చిన్నచిన్న సంసారులు కోటేశ్వర్రావులు
వీరేశ్వర్రావులు గొంగళీ పురుగులు లక్షలు లక్షలు.

విసుగెత్తి చివరకి గొంగళీపురుగు
బల్లపరపుగా పరచుకొన్న తన జీవితాన్ని పరుపుచుట్టలాచుట్టి
ఆత్మహత్య చేసుకుందామని అనుకుంటూంటే
పెళ్లాంమాట వినపడి 'బాస్' కేక వినపడి
భయంతో గజగజ వణకుతూ
తిరిగి తన జీవితాన్ని బల్లపరపుగా పరచుకుని
దానిమీద నిద్రపోయింది గొంగళీ పురుగు
సగంసగం తిన్న కలల్ని నెమరేస్తూ
సగంసగం చచ్చిన ప్రాణాన్ని జోగొట్టుతూ.

వేయికోసుల వెనకి వేసారి ఫలమేమి
ఒక్క రసిక హృదయమున్న చాలు
కవిత తెలియకుండ కాగడా వేలయా
విశ్వదాభిరామ వినురవేమ.

# అబ్బూరి రామకృష్ణరావు

## ఈ స్మశాన భూమిఖండము

ఈ స్మశాన భూమిఖండ మీకాలిన నీలినేల
కాలము కన్నీళ్లు కార్చి క్షాళించిన బూదిప్రోవు
జీవన బాధా వీధులు చేరిన విశ్రామశాల
నీరవ నిబిడాంధ కార నిర్వాణమ్మునకు తావు
ఈ వసంతవేళ నేడిదేమో చివురుల మంటలు
రేపి రేపి యెద యెదలో మేలుకొల్పి కలరవములు
వల్లె కాటపండించిన దెన్నో పూవుల పంటలు,
చిందించిన దల్లవిపో సురభిళ మధురా సవములు
అవ్వలి పెంజీకటిలో నవరోధము తెల్ల చీల్చి
కటిక నేలపై శ్యామల కోమల రాంకపము మడిచి
దగ్ధులైన ప్రాణులు తరుల తావేషములను దాల్చి
తరలి వచ్చి నిల్చిరేమొ ! మృత్యు రాజధాని విడచి
ఏయశాంతి నర్తకి యీసింగారము లొలికించెనొ ?
ఏపురాణ శోక రేఖలీ యామని పులకించెనొ ?

# ఎమిలీ డికిన్సన్

ముగియుటకు ముందరే
ముగిసింది నా బ్రతుకు యినుమారు
అరయవలె నేదేని సంఘటన నమరత్వ
మావిష్కరించు నేమో మూడవమారు

తొలి రెండుసారుల వలె నదికూడ
తలపున కతీతమ్ము - నిరాశా భరితమ్ము
నాకముగురించి మనకు తెలిసినది
నరకమునుండి వలయునది ఒక్క వియోగమ్ము.

అనుకృతి : ఆరుద్ర

# ఆ ఛ ద్ర

ఆ ప నీ

ఒసే ఒసే భువీ భువీ
పసందుగా లేవే
అసయ్యం నీమొహం
అసింటా పోవే

—ఒరే ఒరే కవీ కవీ
సరే సరే కానీ
మనీవినా మనాళనా
మనస్సిటే రానీ.

పుస్తె తెంచుకో పుట్టిముంచుకో
పస్తు పడుకో ముష్టి అడుకో
వి స్తరి మో స్తరు చంద్రుడు
కా స్తయినా అందడు

—నడూనడూ ముందునడు
చెడామడా చెడు
కిందపడు మీదపడు
నిందించడు నిన్నెవడూ

అంటలేక మిన్ను నిన్ను
కంటినీట తడుపనీ
జంటలేక బ్రతుకలే
నంటావా అవనీ

—మతికొంచెం విడిచెయ్
బ్రతుకు చితుక పొడిచెయ్

పతిని విడిచి తిరుగుడు ?
ప్రతిరాజూ నీ మొగుడు !

—దగ్గరకే రాదు అఘం
బిగ్గరగా అరవకు
మెత్తని పూదారి సుఖం
కత్తిమీద నడవకు

చప్రాసీలా చంద్రుడు
ఆప్రెవూ తిరుగును
ఏప్రెలు పూలై ఇనుడు
చుప్రహో అనుడు

—హాలాహలం కాఫీగా
సాఫీగా తాగుడు
దవానలం సాదాగా
సీదాగా సాపడు

సలసల మరిగేసలహా !

—వెలస్వల్పం వరహా

అహాహా !

—ఆహా !

నరుడా నీ వరుడు ?

—మధువు వాడి వధువు

కవిత కంటి బిందువు

—అవధి లేని సింధువు.

# పరాభి

## యాత్రా ఛందస్సులు

### ౧. సిలోను పిల్ల

లంకాపురిసఖీ ! ప్రేమి
కుడన్ నేను, నాకు ఏమి
కనిపించదు, నీవేగతి
ప్రియే ! శరణంగచ్ఛామి

నాట్యమాడు నక్షత్రాచు
కరణి నీదు కబరి దోచు
నీ నవ్వులు న్యూరేలియ
పవనాల పగిది వీచు

నీ నోరు సముజ్జ్వలించు
రత్నపురము లాగ ; ఇంచు
బోడి ! దంతముల్ కాంతి
విహారంబటు కానుపించు

పొలనూరువ సరసులాగ
రాణించును, నీదు సోగ
కనులు : సాగుబడి చేయుము
నాచిత్తపు బీడువేగ

రువాన్ వేలిడగో బాల
విడం బించునుగా చాల

అత్యున్నతమగు తావక
వక్షోజము లోసి బాల !

తావక మధ్యంబు నాస్తి
నీరూపు జగాప్రశస్తి
నీదు శ్రోణి డంబుల్ల గి
రి నితంబము కన్న జాస్తి

నిన్ను అనుసరించు విధము
అదేనాకు ధర్మపథము
ఆదేనాకు జీవితాశ
అదేనాకు మనోరథము

యాచింపుచు ప్రణయభిక్ష
నిలచి యుంటి నీ సమక్ష
మందు ! భిక్కువటు - ముద్దిడు
మదే నాకు బుద్ధరక్ష.

నీవు అప్సరస్సు దతివ ?
కాకుండిన రతివ ? అతివ !
సిగిరీయా చిత్రమ్ముల
నుండి లేచిటు వచ్చితివ ?

నీ స్వంగమునందు గ్రుచ్చి
నిర్వాణ సుఖమ్ము లిచ్చి
సిద్ధార్థుని గావింపుము
సింహళ సరసీరుహాక్షి.

## ౨. స్కాచి పిల్ల

స్కాట్లాండు సరోరుహాక్షి !
నీదు సోయగమ్ము సాక్షి
కన్ను గుట్టు నిన్నుజూచి
నంత, త్రాగినట్లు స్కాచి

మంచు ముసువునుండి నవ్వు
బంగారు గులాబి పువ్వు
కరణి కానిపించు నీమ
నోహరాస్య మోసి లెమ !

పొదరుపూల తోడమెండు
నిండి విరాజిల్లు చుండు
త్రోషాకు ధరాధరాలు
తావకారుణాధరాలు

ఉన్ని ట్వీడు కన్నగూడ
ఉడుకు నిచ్చు నీదుగాథ
పరిష్వంగ బంధనమ్ము
మోహాగ్నికి ఇంధనమ్ము

స్కాట్లాండు సరోరుహాక్షి !
నీ సోయగమ్ము సాక్షి
కన్ను గుట్టు నిన్ను జూచి
నంత, త్రాగినట్లు స్కాచి.

3 హోన్ల

హవాయి కడుతీ
యవాయి పడతీ !
భవచ్చతురిమన్
విలాస గరిమన్
నుతింప నసహో
యుడీతడు సహో !
సఖి ! నీకలహో
సమాలి కలహో !
వసంత కుసుమా
లసంత లుసుమా
ప్రియా విపులనే
త్రయుగ్మములనే
నుతింప గలనా
ఆలోహ లలనా !

౪. చయినా యువతి

ఓ సుందరమగు చయినా
దేశంపు మత్స్య నయనా !
నీయందము వినుతింపగ
సాధ్యంబ బ్రహ్మ కయినా ?

జ్యోత్స్నా దర్పవంపు టలయా !
లేకున్న వింత కలయా !
ఏమి నవ్వు ? నిత్య నూతన
లావణ్య శోభ నిలయా !

రక్తా ధరముల పయినా
నోరారముద్దు లియనా
శూన్యాంతర శశిరీతి, మ
దీయాంత రంగ శయనా !

నీ పల్కులు శుకరుతముల్
నిన్ సోకగ మారుతముల్
మూర్ఛిలునహో ! నీనయ
నాలర్థ నిమీలితముల్

ఓ సుందరమగు చయినా
దేశంపు మత్స్య నయనా
నా ముంగల నిలుచుంటివి
దివ్యాప్సరస్సఖి నయనా !

---

## అ జ ం తా

చెట్లు కూలుతున్న దృశ్యం

ఆశలేదు ఆస్కారంలేదు
ఫలానారోజు శాపం ఆఖరౌతుందనే హామీలేదు
ఫలానారోడ్డు గమ్యం జేరుస్తుందనే సూచన ఎక్కడా ఏమీలేదు
జీవితం ఎప్పుడూ ఇలా కన్నీళ్ల ప్రవాహంగానే సాగుతుందనుకుంటాను
రోడ్డు పొడుగునా చెట్లు కూలుతున్న దృశ్యాలనే చూపుతుందనుకుంటాను

ఐతే ఇప్పుడు అక్షరాలా నిజం
మిత్రుడు వెంకట్రావు జీవితంలో చెట్లు కూలుతున్నమాట నిజం
లేకుంటే ఎంతో అందమైన సాయంత్రంకదా ఇలా అపస్వరాలు
వినపడటం జరగదు
రోడ్లమీద ధూళీ దారిద్ర్యం సమస్తం మిత్రుడు వెంకట్రావు ముఖం
మీదనే 'టచ్చాడుతూ' ఉండటం సంభవంకాదు
అసలు వెంకట్రావు ముఖం గాలీవెల్తురూలేని గదిలాగ మరీ ఇంత
దీనంగా ఎన్నడూ ఉండనే ఉండదు

ఐతే ఇప్పుడు నిర్ధారణగా చెప్పుకోవచ్చు
మిత్రుడు వెంకట్రావు ప్రస్తుతం ఒక నిరుద్యోగి అని మరీ మరీ రూఢిగా
చెప్పు కోవచ్చు
అంతే కాదు ప్రస్తుతం మిత్రుడు వెంకట్రావు కాలం అనే గరుడ పక్షి
ఎక్కడ ఏముళ్ల చెట్ల మీద విహారం చేస్తు
ఉందో కూడా మనం ఊహా చేసు కోవచ్చు
హృదయ విదారకమైన ఒకానొక దృశ్యం కళ్లారాచూడవచ్చు

తలక్రిందులైన స్వప్నం మీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు
ఆ పాద మస్తకం సూదులతో-ముస్తాబై ఉన్నవాడు
అతని ముఖం నిండా స్ఫోటకం మచ్చలు
కళ్లలో శిలావిగ్రహాల వీక్షణలు
అతని చుట్టూ పరాజయ భారంతో కృంగుతూ ఉన్న వృక్షాలు

ఇదే దృశ్యం ఇంకా భారీ ఎత్తున భూతద్దాలతో చూడవచ్చు
మిత్రుడు వెంకట్రావు ప్రస్తుతం ఎక్కడ ఏవేళ ఏంచేస్తూ ఉంటాడో
కూడా మనం ఊహ చేసుకోవచ్చు
నిరుద్యోగి వెంకట్రావు నిత్యం ఆకాశంక్రిందనే ప్రస్తుతం నివాసం చేస్తూ
ఉంటాడు
రెండుకాళ్ల వాహనం మీదనే నగర సంచారం చేస్తూ ఉంటాడు
అడుగడుగునా తన జీవితం పేకమేడలై కూలుతున్న దృశ్యాన్ని చూస్తూ
నగరం అంతటా అపస్వరంలా వ్యాప్తమౌతూ ఉంటాడు

నిరుద్యోగి వెంకట్రావు రోడ్లమీద నడుస్తూఉంటే
సమీపంలో ఎక్కడా జన సంచారం ఉండదు
చెట్లమీద ఆకుసైతం అల్లల్లాడదు
టెలిఫోన్ తీగలలో వార్తాప్రసారం సాగదు

నిరుద్యోగి వెంకట్రావు నగరం నడివీధిలో తన జీవితాన్ని తెరుస్తూఉంటే
ఎందుకో అకారణంగా సూర్యుడు ఖిన్నుడౌతాడు
ఆగ్రహం పట్టలేక భూదేవి బ్రద్దలౌతుంది
ధర్మదేవత ఉన్న ఒక కాలూ విరుచుకుంటుంది

నిరుద్యోగి వెంకట్రావు గాలిలో ధూళిలో ఎండుటాకులా సుడిగుండం
తిరుగుతూ ఉంటే
నగరంలో గృహస్థులు ఆరోజు సన్యాసం పుచ్చుకుంటారు

పిల్లలుగల తల్లులు బావిలో దూకుతారు
విద్యార్థులు పుస్తకాలు నడివీధిలో తగలబెడతారు

నిరుద్యోగి వెంకట్రావు నగరం గుండెలలో సాలీడులా అల్లుకుంటూఉంటే
ప్రభుత్వ భవనాలలో ఎక్కడా ఒక్కక్షణం పాటు ఎవరికీ ఊపిరి ఆడదు
కలం కాగితం పట్టుకున్న అధికారిచెయ్యి దానంతటదే రాజీనామా పత్రం
మీద సంతకం పెడుతుంది
ప్రభుత్వ భవనాలమీద జెండా సిగ్గుతో తల వాల్చుకుంటుంది

నిరుద్యోగి వెంకట్రావు తన ఆకలిని రాళ్లలో రప్పలలో దాచుకుంటూఉంటే
రాజకీయ వేత్తలు వాటిని వేలంపాటలో కొనుక్కుంటారు
విషాదంయొక్క రంగు ఎలాఉంటుందో తెలుసుకునేటందుకు కవులూ
చిత్రకారులూ అతని కన్నీళ్లమీద పరిశోధనలు సల్పుతారు
అతని పాదధూళిలో చీకటి పుట్టుపూర్వోత్తరాలు వెతుకుతారు

నిరుద్యోగి వెంకట్రావు తన బాల్యస్మృతులు తలుచుకుంటూ ఉంటే
నగరంలో ఆరోజు పసిపిల్లలు అన్నం ముట్టరు
పువ్వులు కోసుకుంటున్న పిల్లలను పాము కరుస్తుంది
దొడ్లో గున్నమామిడి చెట్టు ముమ్మాటికీ నేల కూలుతుంది

నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరంమీద ఒక మచ్చ

బాధ అనే దీపం పట్టుకొని
సర్వనాశనం అనే తాళం చెవి పట్టుకొని
వెంకట్రావు జీవితం అనే చీకటి నరకకూపంలో భయంకరమైన
ఆశ్చర్యాలు ఇంకా అనేకం చూడవచ్చు
జీవితంమీద ఇంకా నమ్మకం ఉన్నవాడు వెంటనే అక్కడే ఉరిపోసుకుని
చావటం ముమ్మాటికీ సంభవం కావచ్చు

నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరం ముఖం మీద నిజంగా ఒక మచ్చ
నిరుద్యోగి వెంకట్రావు చావడు
చావటం అనే మహాపాపం చెయ్యకుండా న్యాయాధిపతులు ఎప్పుడూ
అతన్ని కాపాడుతూ ఉంటారు
రోడ్లమీద భిక్షకులు అతనిలో ఎప్పుడూ కొత్త ఊపిరిపోస్తూ ఉంటారు
జీవిత మాధుర్యాన్ని గూర్చి చీమసైతం అతన్ని హెచ్చరిస్తూ ఉంటుంది
నిరుద్యోగి వెంకట్రావు ఎన్నటికీ చావడు

అంచేతనే అందమైన ఈ సాయంత్రంవేళ నగరం అంతటా అపస్వరాలు
వెంకట్రావు నడుస్తున్నంతమేరా చెట్లు కూలుతున్న దృశ్యాలు

# బైరాగి

క్రిస్మస్ గీతాలు

౧

అవకాశం, ఆహ్లాదం, ఆలోకం
నెత్తుటి మడుగుల పూచిన
తెల్లని తామర పూవై
క్రీస్తు వెలసినాడు మరల.
లోకమంత నిశ్శోకం.
హింసా శర్వరి గతించి
స్వర్ణ ఘంటికల సురభిళ
నిస్వన గీతులు రుతించి
దేవపుత్రకుని నుతించు
పథభ్రాంత పణ్యాంగన
దిక్కులేని కుష్ఠరోగి
చనిపోయిన లాజరస్సు
ఎందరెందరున్నారో
అందరికీ అవకాశం
ఆనందం ఆలోకం
లోకమంత నిశ్శోకం
శాంతి, శాంతి భూతలిపై
శుభైషణలు జనావళికి.
ఈరోజు జనించాడు

రారాజు జనుల హృదులకు
నీరాజనము లెచటోయి ?
శైశిర ప్రాతఃపథాన
తుహినస్నాతావనిపై
రవికిరణ లోకనముల
శతసహస్ర శక్రచాప
వితతుల అగణిత మణిమయ
జ్యోతులుద్భవిల్లునేడు
లోకమంత నిశ్శోకం
శాంతి, శాంతి భూతలిపై
శుభైషణలు జనావళికి

౨

యూదులకు కూడశాంతి
ఆమిషాస్థిమయ గాత్రం
దీనం కరుణా పాత్రం
వంచన తామసనైజం
అప్రవంచితం కాంతి,

పైలట్లకు కూడ శాంతి
క్షమ్యం మానవుని నియతి
కేవలాంధ కర్మనిరతి
బాలురమాయకులు వారు
సహజ సులభమే భ్రాంతి.

హంతకులకు కూడ శాంతి
హింసకు ప్రతికాదు హింస

ఆరని జ్వాలిక జిఘాంస
నృశంసులకు తగిన శిక్ష
ప్రేమపాశముల శాంతి.

దుర్బలులకు కూడ శాంతి
మూడుమార్లు కోడికూత
అగ్నిపరీక్షలకు దూత
అడుగులు తడబడినవారి
దక్షమజన విక్రాంతిః

సైతానుకు కూడ శాంతి
ఓడిన దేవులు దైత్యులు
ఓడిన ఆర్యులు వ్రాత్యులు
ఘృణాఘృణుల స్వర్ణరేఖ
కవలిదెల్ల విభ్రాంతి.

విష్టపత్రయాన శాంతి
ఈనిముసం నవజననం
గతము తుడిచినది తుహినం
శ్రాంతపాంథ గమ్యం
కను చూపుమేర విశ్రాంతి
శాంతి, శాంతి, శాంతి.

# వరద రాజేశ్వరరావు

అన్నా ! యీ బ్రతుకుచేదు
అంతకన్న తెరువులేదు !
అన్నా ! యీ పరుగు వృథా
ఆగిపోవటం మంచిది !

అయ్యో ! యీ గొంతువిడదు
అంతకన్న పాటచెడదు !
స్వర్గ శిలావేదికల
సంగీతం కరిగించదు !

అన్నా ! యీ చింతనీడ
అవతరించ దతనిజాడ !
ముళ్ళదారి తప్పించుక
మళ్ళిపోవటం మంచిది !

అయ్యో ! యీ చెంతనలుపు
ఆకాశం వింతపిలుపు
ఈ యాత్రకు చివరలేదు
ఈ రాత్రికి చెవులులేవు !

# కవిరాజ మూర్తి

ప్రార్థన

కారడవిన కలిలో కారాడే
దిక్కులేని ఏకాకిని
క్రూర మృగమ్ముల వలె
దిక్కుల దహించు దావాగ్నుల వలె
అధికారపు అంచులపై అంగల వేసే దానవులనుండి
రక్షించు ప్రభూ, రక్షించు....

ఈ లోకపు వనమ్ములో పూవులు లేనే లేవు
ఈ మొక్కల రంగు ఆకుపచ్చ అసలే కాదు
ఈ వనాన గల కోయిల 'కూకూ' యని కూయదు
ఈ సెలయేటి వినాదం కర్ణపేయంగా ఉండదు
ఈ గులాబి రెక్కలలో దుర్గంధం పులుముకుంది
రక్షించు ప్రభూ, రక్షించు....

ఈ లోకపు నింగిమీద నక్షత్రాలు లేవు లేవు
ఈ నింగి నున్న మబ్బులపై రంగురంగు తెరలు లేవు
ఆకాశపు ఉవ్వెత్తున విహంగములు ఎగుర లేవు
ఇంద్ర ధనుస్సు గర్భంలో ఏడు రంగు లసలు లేవు
రక్షించు ప్రభూ, రక్షించు....

ఈ లోకానికి నేను వచ్చి ఇప్పటి కెన్నియుగాలో
ఈ ధూళి నిండా నిండిన నా శల్య కణాలు ఎన్నో

ఈ చరిత్ర ధరిత్రి నిండా పులిమిన నా నెత్తుటి దుర్గంధం ఎంతో
ఈ సామ్రాజ్యపు అట్టడుగున నా చితికిన పుర్రెలు ఎన్నో
రక్షించు ప్రభూ, రక్షించు....

అమావాస్య నిశిలో అడుగుల సవ్వడి వలె
భయ కంపిత హృదయంలో మ్రోగే దడదడ వలె
మృత్యువు ఆగమనంలో బెదిరే కాయం వలె
నాలోనే ఇమిడివున్న నరరూపపు దానవుని నుండి
రక్షించు ప్రభూ, రక్షించు....

ఎర కోసం ప్రాకులాడు మంద బుద్ధి మీనం వలె
శ్లేష్మంలో తిండి కొరకు దేవులాడు ఈగలాగు
సంసారంలో సౌఖ్యం కలదనుకొను భోగి వలె
ఇద మిద్ధం తేలనట్టి ఈ లోకపు సౌఖ్యం నుండి
రక్షించు ప్రభూ, రక్షించు....

ఈ కీకారణ్యంలో అడుగుల సవ్వడి లేదు
ఈ నిర్జీవపు ఎడారి ఎదలో రాయిలేదు రప్ప లేదు
ఈ భయంకర నిశీథంలో మిణుగురుల కాంతి లేదు
ఈ సముద్ర గర్భపు చీకటిలో శీతలత లేదు
ఈ గుడి గంటల చప్పుడులో భావికాల దీప్తి లేదు
ఈ సముద్ర వైశాల్యానికి అంతూ పొంతూ లేదు
రక్షించు ప్రభూ, రక్షించు....

ఆశ నిరాశల అల్లిక మలుపులలో
జీవన్మరణపు బిగి కౌగిలిలో
చావు బ్రతుకుల సాంధ్యకాల నీరంధ్రంలో
కూడు గుడ్డల కూడలిలో, సుఖదుఃఖాల సమన్వయంలో

కుమిలి కుమిలి చితికే బ్రతుకుల
రక్షించు ప్రభూ, రక్షించు....

నీవేరూపంలో ఉన్నావో నిజంగా తెలియదు
నీవేరూపంలో వస్తావో నమ్మలేము నమ్మలేము
నీవే ఓంకారమ్మన నమ్మి నిన్ను స్మరించాము
నీవే శిలారూపమ్మన నమ్మి నిన్ను కొలిచాము
నీవే సర్వాంతర్యామివన అవునను కొన్నాము
నీవు ఉన్నావన నమ్మాము, నీవసలే లేవన్నా నమ్మాము
రక్షించు ప్రభూ, రక్షించు....

నిన్ను నమ్మిన నిన్న ఎంతో నిశ్శబ్దంగా ఉండేది
నిన్ను చూచారేమో నిన్నటివారు నిరుత్సాహ పడలేదు
నిన్న నీవు ఉన్నావేమో నీరు నిశ్చలంగా ఉండేది
నిన్న నీవు ఉన్నావేమో నింగి నిర్మలంగా ఉండేది
పచ్చని పొలాలు, పిచ్చుకల సమూహాలు వెచ్చని సంగీతం పాడేవి
రక్షించు ప్రభూ, రక్షించు....

అందుకే నీవీసృష్టిని నిలిపావని లోకం నినదించింది
ఆకాశంలో ఎగిరే విహంగాలను
సముద్రంలో లేచే తరంగాలను
శరవేగంగా పరుగెత్తే తురంగాలను
నీవే సృష్టించావని నమ్ముతుంది లోకం
సకల చరాచరమ్ములకు నీవధినాధుడవన్నది శాస్త్రం
ఐహిక ఆముష్మిక పథపథనిర్దేశీ
దృశ్యాదృశ్య జగదుద్ధారక !
రక్షించు ప్రభూ, రక్షించు....

# వరద రాజేశ్వరరావు

ఎవరో విరుతిస్తున్నా
రవతల విధిస్రోల చరమ యాత్రాగతిలో
ఎవరో విరచిస్తున్నా
రివతల మృతిలో చెదరిన హృదయ స్మృతిలో

ఆవల ఆకటి కుటిలో
ఆవేదనల చితిలో భయంకర దృశ్యం
ఈవల చీకటి తటిలో
దావానల దీప్తిలో వ్యథల నైరాశ్యం

ఆయెడ బాధల సంపుటి
మాయని వలపుల విరిసిన మధుర స్వాంతం
ఈయెడ గుండెల కుంపటి
తీయని తలపుల ముసరిన దీర్ఘ ధ్వాంతం

అటు చూస్తే అటు కాంతికి
చటుల జ్వాలాప్రభూత సంధ్యాచరణం
ఇటు చూస్తే యిటు శాంతికి
జటిల క్ష్వేళాప్రణీత ఝుంఝూవరణం

మదిలో చీకటి పొదలో
నిదురిస్తూ కలల తూలి నేనొక్కణ్ణే
హృదిలో చీకటి రొదలో
నిదురిస్తూ కడల తేలి నేనొక్కణ్ణే

# బాద్‌లేర్

## నగరం

ఆనందంతో అవరోహించాను గిరిశిఖరాన్ని
ధ్యానించేందుకు పాతకి నగరాన్ని
వేశ్యాగృహం, వైద్యశాల, కారాగారం, శరణాలయం, నరకం
విరుల్లా విరుస్తున్న ఘోరాలు !

నాబాధల్ని పరిపోషిస్తున్న శని దేవతవు
వాటికై నారోదనం
వ్యర్థం కాదని నువ్వెరుగుదువు

పారవశ్యంవినా మరేం కోరని
వయసు మీరిన ప్రేయసి కోసం
పరితపించే ముది మద మూర్తిలా
వాంఛించా నీ మేరలేని వార కాంతను
పునః ప్రభావించే నరక సౌందర్యాన్ని!

చలి బరువున ప్రొద్దుపొడుపు మడుపుల్లో
తలదాచుక నిదురిస్తున్నా సరే
చీకటిలో మెరిసే పైడిరేకుల ముసుగుల్లో
శృంగారించుక కులుకుతున్నా సరే

ఆరాధిస్తాను, అపకీర్తిపాలైన నగరాన్ని
వ్యభిచారులు, చోరులు, నాకు
సమకూర్చే సంతోషం
సామాన్యుల కర్థంగాని విశేషం.

## రాం బో

కమలిన వేసవి కను చీకటిలో
వరించి ముళ్ళమధ్య వరిపొలం దాటి
మెత్తని పచ్చికపై నడుస్తాను
నా తలవని తలంపుటడుగులకు
చల్లదనం సోకుతుంది
నా నగ్నశీర్షంపై చెమ్మగాలి వీస్తుంది

పదాలతో లేదు నాకు ప్రమేయం
భావాల కంతకన్న లేదు నిమిత్తం
నా హృదిలో ప్రణయం ఉప్పొంగుతుంది
మేరలేని నీరధిలా
ప్రకృతి పార్శ్వంలో బికారివలె నేను
పర్యంకాన యెవరో మనోహర ప్రమద
పవళించిన ప్రమోదం నాది !

రాంబో

నక్షత్రం రాలుస్తున్నది కెంజాయ కన్నీళ్లు
నీ కర్ణాల వక్రకుళాయాల్లో
కంఠం నుంచి కటీరందాకా
స్రవిస్తున్నది అనంత సితవర్ణం
నీ అరుణారుణ చూచుకమ్ముల
ప్రవాళమ్ములు ప్రకాశిస్తున్నవి
మానవుడే నెత్తురోడ్చును
నీ జైత్రసక్తి నికృష్ట స్థితి !